దీనికి ఉద్యాపనము:—ఒకముత్తయిదువునకు తలంటినీళ్ళుపోసి రవికెలగుడ్డ దక్షిణతాంబూలము ఇచ్చి పండ్రెండుఅట్లు పూసికాసియున్నఅవకొమ్మలు తెచ్చి పేనినెయ్యి బెల్లముతో ఆముత్తయిదువునకు వాయన మియ్యవలెను శక్తితప్పినాభక్తితప్పరాదు కథలోపముయినావ్రతలోపముకాకూడదు.

## 2 అట్లతద్దెకథ.

రాచవారిఅక్కమ్మ వెలమవారి అక్కమ్మ బ్రాహ్మణవారి అక్కమ్మ కోమటివారి అక్కమ్మ కాపువారిఅక్కమ్మవీరయిదుగురుతద్దెనోము నోచుకొందమని వుపవాసములుండిరి మూడుజాములు దాటిన తరువాత సుకుమారి అయిన రాచవారి అక్కమ్మ మొగముతిరిగి పడిపోయెను అంతటఅన్నలువచ్చి యేమమ్మాయిటుపడిపోయినదని తల్లిని అడుగగా నాయనా తద్దెనోము నోచుకుందామని యుపవాసముండి చంద్రుడువచ్చినదాక నుండలేక పడిపోయినదని చెప్పెను. అప్పుడొకయన్నగారు చింతచెట్టెక్కి అద్దముకట్టి ఆకికుప్పకు అద్దమునకుతిన్నగా చిచ్చుపెట్టిచెల్లెలిని లేపి అమ్మాయీ అదుగో చంద్రుడువచ్చినాడు అచింతచెట్టునైపునకు చూడుమని చింతకొమ్మకు కట్టిన అద్దములో కనబడుచున్న మంటను చంద్రుడుగా భ్రమింపజేసి నోము నోచుకొమని చెల్లెలితో చెప్పెను. ఆమెనిజముగా చంద్రుడు వచ్చినాడనుకొని సంతోషించి నోమునోచుకొని అన్నముతినెను అంతనామెకుపదియేండ్లు వచ్చినతరువాత పెండ్లిచేయుటకు ప్రయత్నించగా ముసలిమొగుడు వచ్చెను. ఆమెవానిని చూచి నాకు పెండ్లి అక్కరలేదని అయ్యోతద్దెనోమునోచుకుంటే పడుచుమొగుడువచ్చునని సాయంత్రముదాకానుండి నోము నోచుకొని అన్నము తింటిని నాకీముసలిమొగుడేల దాపురించెనని విచారించుచుండెను అంతట తలిదండ్రులువచ్చి అమ్మా మనది రాచకులము పెండ్లియాడకుండుట తప్పు అని అనేకవిధములు చెప్పినను వినక

ఘోరరాత్రివేళ అడవిలోనుండి ఇదివో ప్రమందిరము అట్లు
పోయి యొకకొలనుదగ్గరనున్న మర్రిక్రింద నిష్ఠతో తపస్సు ముకలు
పెట్టెను ఇట్లుకొంతకాలముగ్రతపస్సుచేయుచుండి భూమిపై కాలనైన యా
దారింటనరుగుచున్న పార్వతీపరమేశ్వరు లామెనుచూచి ఓచిన్నదానా
ఎందుచేత నిట్లుగతపస్సు చేయుచుంటివని యడిగిరి అందుకామె మీ
రేమి ఆర్చెడివారా తీర్చెడివారా మీకెందుకు అని యుత్తరమిచ్చెను
ఆర్చెడివారము తీర్చెడివారము మేమే చెప్పవలయునని మరలవా
రడిగిరి అంతనామె లేచి వారికి నమస్కరించి నేను అట్లతద్దినోమునోచుకొ
న్నాను నాతోనోచినకొన్న వారివలెగాక నాకుముసలిమొగుడు వచ్చి
నాడు నేనేమిపాపము చేసితినోయని యామె దీనముగపలికెను నీవుపవా
సముండి మూడుజాములు తిరిగిన తరువాత మొగముతిరిగిపడిపోగా నీ
యన్నవచ్చి చింతచెట్టుకొమ్మకుఅద్దముకట్టిక్రిందచిచ్చుపెట్టియాయద్దము
లో కనబడుచున్నమంటను చంద్రుడని భ్రమింపజేయుగా నీవునిజము
గా చంద్రుడు వచ్చెనని నోమునోచుకొని భోజనముచేసినావు ఆకా
రణముచేత నీకుముసలిమొగుడు వచ్చినాడు అని వారు చెప్పి ఇప్పుడై
న నింటికిపోయి దీపాలవేళదాకనుండి నోమునోచుకొన్నయెడల పడుచు
మొగడు వచ్చునని చెప్పిరి అప్పుడాపిల్ల యింటికివచ్చి రాత్రిదాక
నుపవాసముచేసి యథావిధిగనోమునోచుకొనియెనుఅంతనామెకుపడుచు
మగడు వచ్చెను అప్పుడూరువారందరును ఏమినోమునోచితివమ్మా ఏమి
వ్రతము పట్టినావమ్మా నీకు పడుచుమగడుదొరకుట అనియడిగిరిఅందు
కామెఅట్లతద్దె దీపాలవేళదాకనుండి నోమునోచుకొన్నాను ముసలి
మగడు పడుచుమగడు అయినాడుఅని చెప్పెను.

ఉద్యాపనము:—కలియుగమందందరును అట్లతద్దెనోముపట్టి ప
దేసి అట్లనైవేద్యముపెట్టి పదేసి అట్లు వాయనమునిచ్చి యీవిధిగా ప
దేండ్లు అయినతరువాత పదిమంది ముత్తయిదువులకు పదేసి అట్లుభ

బ్రాహ్మణులకు భక్తితో వాయనమియ్యవలెను కథలోపమైనా వ్రతలోపము కాకూడదు భక్తి తప్పినా ఫలము తప్పదు.

## 3 ఆపదలేని ఆదివారముకథ.

ఒకబ్రాహ్మణుడు కొడుకునకు ఆచిన్నదానిని తెచ్చి వివాహముచేసి కోడలిని తనయింటికి తీసుకొనివచ్చెను ఆమె ఆపద యనిన యేమో తెలియక ప్రతిదినము మామగారి యింటికి రాగానే మామా ఆపదయనగా యేమియని యడుగుచుండెను ప్రతిదిన మిట్లు అడుగుచుండగా విసుగువచ్చి ఆ బ్రాహ్మణుడు దగ్గరనున్న తాటాకు పుచ్చుకొని చిన్నదానిని కొట్టెను చిన్నదాని దెబ్బకు మూర్ఛపడిపోయెను ఆ రూపచూడలేక యా చిన్నదానితల్లి అడవిలోనికి వెళ్ళి విహరించుచుండగా పార్వతీపరమేశ్వరులు భూమి పాలించుటకు వచ్చి ఆమెను చూచి యేమి యిట్లున్నావని యడిగిరి ఆమె నాజోలి మీకెందుకు వెళ్లుమనగా పార్వతీపరమేశ్వరులు అలాగు కాదు చెప్పవలసిందని యడిగిరి నాకుఆపద మనసులో ప్రతిదినము మామయ్యగారిని ఆపదయనగా యేమిటియని యడుగుచుండగా ఆయనకు కోపమువచ్చి దగ్గరనున్న తాటాకుతో నా బిడ్డ కొడుకును కొట్టినారు అతడు మూర్ఛపడినాడు ఆ బాధను భరించలేక యీలాగువచ్చినానని బ్రాహ్మణస్త్రీ చెప్పగా పార్వతీపరమేశ్వరులు నీవు క్రిందటిజన్మమున ఆపదలేని ఆదివారము మూపట్టి ఉద్యాపన చేసినావు అందుచే నీకు ఆపదయనగా నది యెప్పటికి యీ మూపట్టి క్రమముగా ఉద్యాపనము చేసుకొన్నయెడల నీకీ ఆపద పోవునని చెప్పి పార్వతీపరమేశ్వరులు అంతర్ధానము నొంది ఆ బ్రాహ్మణస్త్రీ యింటికివెళ్ళి యీ మూపట్టి క్రమముగ ఉద్యాపనచేసుకొని యేవిధమైన ఆపదలులేక సుఖముగానుండెను.

ఉద్యాపనము:—అయిదుమూనికలపాలలో మానెడు సోలడు బియ్యము పోసి పరమాన్నమువండి అడుగుఅట్టు పైఅట్టు తీసుకొని సూర్య

వకు నైవేద్యము పెట్టి ఆమధ్యవరమాన్నము అయిదుమూళ్ళ అయిదుదబ్బులు దక్షిణతాంబూలముతో బ్రాహ్మణునకు వాయన మియ్యవలెను. కథలోపమయినను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలముతప్పదు.

## 4. గాజులగౌరిదేవి కథ.

ఒక బ్రాహ్మణుని కోడలు గాజులగౌరిదేవి నోముపట్టి ఉల్లంఘన చేసెను. అందుచేత ఆమెను చూచి అత్తా చిటచిటలాడుచుండెను వారు ఇరుగుచిటచిట పొరుగుచిటచిట అత్తా చిటచిట మామాచిటచిట మగడూచిటచిట ఎవరువస్తేవారే ఇలాగున్నారని యాచిన్నది విచారించుచు అడవిలోనికిపోయి తిరుగుచుండెను. అంతట పార్వతీపరమేశ్వరులు భూమి పాలించుటకు వచ్చి ఆచిన్నదానిని చూచి ఏమి ఆలాగువిచారించు తిరుగుచున్నావని యడిగిరి. అందుకామె ఇరుగు పొరుగు అత్తా మామ మగడు నన్ను చూస్తే కోపంగా వుంటారు అందుచేత నందరికి కోపమైతే ఎట్లు బ్రతుకనని ఇలాగు తిరుగుచున్నానని చెప్పెను అలాగు కాదమ్మా నీవు గాజులగౌరిదేవి నోముపట్టి ఉల్లంఘనముచేసినావు ఆకారణమున నిన్నుచూచిన అందరికి కోపముగానున్నది. నీవుతిరిగి ఆనోము పట్టి ఉద్యాపనము చేసుకొంటే నిన్ను అంతా ప్రేమతో చూస్తారుఅని పార్వతీదేవి చెప్పెను ఆప్రకారముగాఆమె యింటికివెళ్ళి నోమునోచుకొని యథావిధిగ ఉద్యాపనముచేసుకోగా అప్పటినుంచి ఆమె అందరికి ఇష్టము గలదయ్యెను.

దీనికిఉద్యాపనము—ఒకముత్తైదువును తీసుకొనివచ్చి ఆమెకు ఇష్టమైన గాజులుతొడగించి తలంటి నిళ్ళుపోసి చీర రవికలగుడ్డ యిచ్చి పిండివంటలతో భోజనముపెట్టవలెను: భక్తితప్పినా ఫలముతప్పదు కథ లోపమైనను వ్రతలోపము కాకూడదు.

## 5. గ్రామణగాంకథ

ఒక బ్రాహ్మణునకు నలుగురుకొడుకులును ఒకకూతురును కలరు ఆకూతురు పుట్టినరోజు మొదలుచేసుకొని రాత్రిపురుగులుగాను పగలు మనిషిగాను అగుచుండేది రాత్రివేళ తల్లి ఆపురుగులను పోగుచేసుకొని విచారించుచుండెను అలాగుననుండ కొన్నాళ్లకు ఆపిల్లతల్లిని పుట్టింటికి తీసుకొనివెళ్ళునిమిత్తమై అన్నగారువచ్చి అమ్మాయీ పిల్లలకు ఏడాది వెళ్ళినది గనుక ఒకసారి పుట్టింటికిరమ్మని పిలిచెను ఆమె ఇప్పుడుకాదు ముందువస్తానని చెప్పెను ఆమాటలువిని అతడువెళ్ళిపోయెను. తరువాత నాలుగేండ్లు అయినపిమ్మట మరల అన్నవచ్చి అమ్మాయీ రమ్మన మని పిలువగా ఇప్పుడుకాదు వస్తానులే అని జవాబుచెప్పెను ఆమెమా టలకు సరేయని అతడువెళ్ళిపోయెను. ఈపిల్లపెద్దదియైనకొలది పురుగులు ఎక్కువగా వచ్చెను ఆపురుగులను రాత్రి తల్లి జాగ్రత్తగా కాపాడుచుం డెను అంతట ఆపిల్లకు పదిసంవత్సరముల యీడువచ్చెను అన్న తిరుగా అన్నగారువచ్చినగాని ఇకమొదల నీకునేములేము మాకునీవులేవు అనిగ ట్టిపట్టుచేయగా ఆమెమారుమాటచెప్పలేక కోడండ్రదగ్గరకువెళ్ళి నాలు గురోజులుపిల్లనుచూచుచుండవలెనని యడిగినదట వారుమావల్లకాదనిరి అప్పుడు నాలుగోకోడలు నేనుచూచెదను మీరువెళ్ళిరండని చెప్పెను ఆబ్రాహ్మణునిభార్య నాలుగవకోడలినితలుపుచాటునకుతీసుకొనిపోయి పగలుసమయమున పిల్ల రాత్రిపురుగులును రాత్రిమాత్రముఆపురుగులు చెదరకుండా క్రిందగుంటతీసి దీపము పెట్టుకొనినది మొదలు జాగ్రతగా గుంటలోనికి పోగుచేసుకొని ఒక్కపురుగైనా పోకుండా చూడవలయు నమ్మా అనిచెప్పి కూతురునామెకొప్పగించి పుట్టింటికివెళ్ళెను అంతదీపా లుపెట్టేసరికి వంటచేసిమామగారికిభర్తకుభోజనముపెట్టి ఆపిల్లను గుంట దగ్గ చాపవేసిపరుండబెట్టి నాలుగవకోడలాపిల్లవద్దపరుండెను తరువాత పిల్లపురుగులగుచుండగా వాటినన్నిటిని గుంటలోనికితోసి తెల్లవారిన

దాక చూచుచుండెను అంతటఆమెభర్త ఆసినారాయుద్ధము రావడములేక్క
ఎక్కడికిపోవుచున్నది అనిఅనుమానపడి మూడురోజులైనతరువాత నా
లుగోరోజున దీపాలు పెట్టగానే భోజనముచేసి ఆచిన్నదివచ్చకొనే గది
గోడమీద కూర్చుండెను అంతటఆమెభోజనముచేసి మామూలు ప్రకా
రముగ ఆకులను కనిపెట్టుకొని కూర్చుండెను ఆరాత్రిచర్యఅంతయు
గోడమీదనుండి ఆబ్రాహ్మణచిన్నవాడు చూచి తెల్లవారినతరువాత
దిగివచ్చి అయ్యో నాచెల్లెలుయింతకష్టపడుచున్నదేమి అనిభార్య
నడిగి నాలుగురోజులనుంచి యేమిచేస్తున్నావు నాకుకనపడడంలేదేమిఅని
కోపపడెను ఈ గాలింటిపని మీఅమ్మగారువచ్చిచెప్పినది యెవరుచేయకని
పెట్టుకొని యుండవలసివచ్చినది అని ఆమెచెప్పగా సమురద్ధయా ఆమె
కుఎందుచేతవచ్చెనో అనివిచారముపొంది అడవిలోనికిపోయి ఆకుమీద
ఆకు పోకమీదపోక వేసుకొని తలక్రిందమీదకాళ్ళుపెట్టుకొని తపస్సు
చేయమొదలుపెట్టెను అంతటఅక్కడికి పార్వతీపరమేశ్వరులు భూమి
పాలించునిమిత్తమైవచ్చి ఈసమీపమునమనసంచారము కలిగియున్నట్లు
కనబడుచున్నది చూడవలెనని పార్వతీదేవి ఈశ్వరునిఅడిగెను ఆడవాళ్ళతో
ఏదిచిక్కువచ్చి వెళ్ళకద్దు అని ఈశ్వరుడుచెప్పగాఅలా కాదుపోవలయును
అని పార్వతీదేవిభర్తనుతీసుకునివెళ్ళి తపస్సుచేయుచున్న బ్రాహ్మణ
చిన్నవానినిచూచెను అట్లుచూచి ఓయిఅబ్బాయీ యీలాతపస్సుచేయు
చున్నావు అనియడిగెను అందుకాబ్రాహ్మణచిన్నవాడు మీరుయిచ్చే
వారా తీర్చేవారా మీకెందుకు వెళ్ళవలసినది అనిచెప్పగా అలా
కాదునాయనా ఆర్చేశివారము మేమే తీర్చేశివారముమేము చెప్పవలసి
నదని పార్వతీపరమేశ్వరులుఅడిగిరి. మాచెల్లెలుపుట్టింటిమనుకలు పగలు
మనిషి రాత్రిపురుగులుగాఅగుచున్నది. అదిఎందుచేతనో తెలుసుకొన
గోరి యిట్లుతపస్సు చేయుచున్నానని యాబ్రాహ్మణచిన్నవాడుచెప్పెను
అప్పుడుపార్వతీ పరమేశ్వరులు దివ్యదృష్టినిచూచి మీచెల్లెలు క్రిందటి

జన్మమున రజస్వలై యింటిలో కలిపింది ఆదోషముచేత యీలావచ్చినది కాబట్టి అమెచే గ్రహణగౌరినోము పట్టించి క్రమప్రకారము ఉద్యాపనము చేయించిన మొదల ఆదోషము పోవునని చెప్పి అదృశ్యులైరి. అప్పుడా బ్రాహ్మణ చిన్నవాడింటికి వచ్చి పార్వతీ పరమేశ్వరులు చెప్పిన గ్రహణ గౌరినోము చెల్లెలి చేత పట్టించి ఉద్యాపనము చేయించెను అంతట ఆపాపము పోయి ఆపిల్ల రాత్రిపగలు ఎప్పటిలాగుండెను, తరువాత తల్లి వచ్చి పిల్ల రత్నములాగున ఉండుట చూచి మునపటి చిహ్నము లేమిలేక పోవుటకు నంతోషించుచు ఏమిటి అమ్మాయీ ఏలపోయింది పు గుగుంట అని కోడలిని అడిగెను. అప్పుడు చిన్నకోడలు అత్తగారు వెళ్ళిన దమొదలు భర్త తనమీద అనుమానము పడుట అడవికి వెళ్ళుట గ్రహణగౌరినోము పట్టించుట మొదలగు సంగతులన్ని పూసగుచ్చినట్లు చెప్పి ఇది గ్రహణ గౌరినోము పట్టుట చేత పోయినదని చెప్పి ఆమెగో మీఅమ్మాయి అని పిల్లను అత్తగారి కప్పగించెను

దీనికి ఉద్యాపనము—సూర్యగ్రహణము పట్టెపట్టిననగా పసుపు కుంకుమ పిండి బియ్యము ప్రత్తి బెల్లము ఆకు పోక దక్షిణలతో వంది టిలో పెట్టి విడిచెననగా ఇంటిలో పెట్టి సూర్యగ్రహణమునాడు కథ చెప్పి అక్షతలు వేసుకొని తొమ్మిది దినములు తొమ్మిది పద్మములు తొమ్మిది వత్తుల దీపము తొమ్మిది అట్ల వాయనము తొమ్మిది అట్ల నైవేద్యము కొత్త జల్లిసి మూత వేసి చీర రవికెలగుడ్డ పెట్టి ఒక ముత్తైదువకు వాయన మీయవలెను.

## 6. కరుళ్లగారిదేవి కథ

ఒక బ్రాహ్మణునకు అయిదుగురు కొడుకులు కలరు అయిదుగురు కొడుకులకు పెండ్లిండ్లయి అయిదుగురు కోడండ్రు కాపురమునకు వచ్చిరి. అందులో అయిదవకోడలు కరుళ్లగారిదేవినోము పట్టినది. అంతా కూడా వేసి వెయ్యికుండా భాగ్యముతో నుండిరి ఆలావుండి అత్తసామ్మొద్దమామసామ్ము

ద్దుపుత్రిసామ్మొత్తదుపుకుమసామ్మొత్తదునాసాష్మనాశమ్మనిసూర్యదేవునిప్రా
ర్థించితమెగోజాసమస్కారములు చేసేది అట్లునమస్కారములు చేసిన
కొంతకాలమునకు అత్తగారికి మామగారికి బావగారికి మరదులకు భ
ర్తకు ఎల్లవారికి ఆమెమీదకోపంగా వుండేది ఆమె ఒకరోజున వముకొని
నిద్రపోవుచుండగా మంచముతోపాటు తీసుకొనిపోయి మహారణ్యము
లో పారవేసిరి ఆమెకొంత సేపటికి నిద్రమేల్కొని అడవిలోనే నీళ్ళుపో
సుకొని సూర్యభగవానునకు నమస్కారముచేయుచుండగా ఆమెవోసిటు
లోనికి నిండుగా వరహాలు వచ్చెను ఆమె తెసుకొని సమీపపల్లెకేగి
పసుపుకుంకుమగిన్నె ఉప్పుమిరపకాయలు బియ్యముమొదలగు యా
వత్తుసామగ్రికొని ఒకగొల్లకునలివాని సహాయమున నొకగుడిసెలో ని
వసించియుండెను ఇంటివద్ద నున్నవాళ్ళకందరికి అష్టదరిద్రముపట్టుకొని
నానాస్థలములు తిరుగుచు తినుటకు తిండికట్టుకుప్పి లేక బాధపడుచు ఒక
నొకనాన కష్టపుపల్లెలనిమిత్తము ఈయడవిలోనికి వచ్చిరి ఇట్లువచ్చి తవకు
సమీపములో నొకచోట సూర్యనమస్కారములు చేయుచున్న యాచి
న్నదానినిచూచి తక్కినకోడండ్రింతా ఇదిగో మాతోటికోడలు ఈలా
గేసూర్యనమస్కారములు చేయుచుండేది అనితమవారితో చెప్పసాగి
సూర్యప్రభావమువల్ల అడవిలోనున్నను కొంచెముడబ్బుకలదై మేడలు
మిద్దెలు గొప్పకట్టించి అరిదేపరిదేపి వస్త్ర అడ్డములేకుండా అన్నముపె
ట్టుచుండేది. ఆసమయమునందు ఆమెఅత్త మామా అక్కడకువచ్చి
మాకింతఅన్నము పెట్టించెదవాఅని యడిగిరి అప్పుడు అత్తమామ అని
ఆమె గ్రహించి మామామగారు అత్తగారు మీలాగే వుండేవారు
మీరేవూరు మీరెవరని అడిగెను. అందుకువారు మేము ఫలానా అని
చెప్పిరి అంతలో పెనిమిటి వచ్చెను. వారిముగ్గురికి ఆమెతలంటి నీళ్ళుపో
యించి వారికిసకలోపచారములు చేయుచు పదమూడుకయళ్ళు కంచము

లోపెట్టి క్రొత్తకంచముకొని చీర ఒకరవికలగుడ్డ కరుళ్ళు పెట్టుకొని ఉ
ద్యాపనముచేసుకొనెను ఏడాదిఅయినతరువాత చీర రవిక పదమూడుక
రుళ్ళు క్రొత్త కంచములో పెట్టి ఉద్యాపనము చేసుకోవలెను కథలోవి
మైనను వ్రతలోపముకాకూడదు భక్తి తప్పినా ఫలముతప్పదు.

## కుంకుమగౌరినోముకథ.

సోమరాజులగారి కూతురు కుంకుమగౌరి నోముపట్టి ఉల్లంఘన
చేసినది. అందువలనచిన్నతనములోనే విధవరికము వచ్చినది. తలిదండ్రు
లు ఆచిన్నదానిని తీసుకొని కాశీపట్టణమునకు వెళ్ళిరి. అక్కడికివెళ్ళినను
ఆచిన్నదాని వైధవరికము పోలేదు ఒకనాడా చిన్నదానితండ్రి గంగయొ
ద్దనగూర్చుని తపస్సుగావించుచుండ ఈశ్వరుడాయనకు ప్రత్యక్షమై
యేమిబ్రాహ్మణుడా ఇట్లుకూర్చునియున్నావు అనియడిగెను అప్పుడు
బ్రాహ్మణుడు నాకు లేక లేక యొకకూతురు కలిగెను. ఆచిన్నదానికివివా
హముకావించితిని వివాహమయిన కొలరోజులకు ఆమెకువిధవరికముఅను
భవించినది ఆకష్టమును సహింపనోపక ఇటు బసహితముగా నీపట్టణ
ము వచ్చియున్నాను అనిచెప్పెను అయ్యో నీకూతురుక్రిందటి జన్మ
మున కుంకుమగౌరి నోముపట్టి ఉల్లంఘనచేసినందున బాల్యదశయందేవిధ
వరికము సంభవించినది అనిపరమేశ్వరుడు దయారసంబు తనమోమున
తొలుకాడుచుండ పలికెను అప్పుడా బ్రాహ్మణుండయ్యా ఇప్పుడేమి
యొనర్చిన నీకష్టముతొలగునో యానతీయ వలయునని యాపరమేశ్వ
రుని ప్రార్థించెను ఇప్పుడుతిరిగి యానోముపట్టియుద్యాపనముచేసినచో
యీకష్టముపోవునని ఆయీశ్వరుడానతిచ్చి యదృశ్యుడయ్యెను అ
ప్పుడాప్రకారమాచిన్నదానిచే నోముపట్టించి యుద్యాపనచేయించెను

ఉద్యాపనము:—పదముగ్గురు ముత్తైదువులకు బరిణనిండుగ కుం
కుమపోసి వల్లపూనలు లక్కజోడు పెద్దదక్షిణ తాంబూలము యిచ్చి ప
దముగ్గురు ముత్తైదువులకు పదమూడు బరణులు యివ్వవలెను.

## చిక్కుళ్ళగౌరి

చిక్కుచిక్కువలు చిక్కుళ్ళగౌరినోము పట్టిమాఘపూర్ణిమముంద
ర వచ్చెను రథసప్తమినాడు కథచెప్పియక్షింతలు వేసుకొని ఎత్తుకున్న బి
డ్డ లేకబాయకుండ చంకబిడ్డ దించకుండ పక్కలోబిడ్డ బాయకుండ కంటి
కాటుక కదలకుండా పెత్తిరాజ చదరకుండా కాలిమట్టె కదలకుండా కట్టినబ
ట్ట విడవకుండా తోడపెట్టినరవిక తొలగకుండా నంటిసొమ్ము వదలకుండా
పొటపుస్తకము ఎడబాయకుండా ఉండవలెనమ్మా పండిచిక్కుళ్ళవ
యిసిచిక్కుళ్ళు సేపంచిపెట్టెను చిక్కుళ్ళగౌరిగేవితల్లి చింతలేకుండ సిరి
సంపదలిమ్మా అనికథ చెప్పి యక్షింతలువేసుకొనెను.

ఉద్యాపనము.—ఒకబంగారపుచిక్కుడుపువ్వు చేయించి చీర
రవికెలగుడ్డ యిచ్చి దక్షిణతాంబూలముంచి ఒకముత్తయిదువకు పిండి
వంటలతో భోజనము పెట్టి పయిని చెప్పిన బంగారపు చిక్కుడుపువ్వు చీ
ర రవికెలగుడ్డ దక్షిణతాంబూలముతో వాయనమియ్యవలెను.

### 9. చద్దికూటిమంగళవారముకథ

ఒకరాజుకూతురు బ్రాహ్మణికూతురు చద్దికూటి మంగళ వా
రములనోము పట్టిరి బ్రాహ్మణికూతురువారం వారం ముత్తయిదువ
నుపెట్టుకొని తొలినాడు అస్తమానమువేళ కూర పప్పు వాగ అన్నము
వండి మూతపెట్టుకొని ప్రొద్దున్నే వంటిమీద సిబ్బిపోసుకొని కథచెప్పి
అక్షింతలువేసుకొని ముత్తయిదువకు దక్షిణ తాంబూలము యిచ్చెను.
ఆలాగ ఏడాది అయినతరువాత పదముగ్గురు పేరంటాండ్రకు యథావిధిగ
దక్షిణతాంబూలములిచ్చి ఉద్యాపనము చేసుకొనెను రాజు కూతురుకి ద
రిద్రము వచ్చెను ఆమె ఆదరిద్రము భరించలేక అడవికి వెళ్ళి తిరుగుచుండ
గా పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమయి ఏమమ్మా ఈలావచ్చినావు
అని అడిగిరి తినుటకు అన్నము కట్టుటకు బట్ట లేక దరిద్రము చేత బాధపడు
చుయీలాగువచ్చినానని ఆమెచెప్పెను అప్పుడు పార్వతీపరమేశ్వరులు

చద్దికూటిమంగళవారమునోముపట్టినదిఅల్లరిఘనముచేసినావుఆ కారణం చేతనీకీదరిద్రబాధ పంభవించినది నీవుతిరిగియింటికి వెళ్ళి ఆనోముపట్టియథావిధిగవుద్యాపనముచేసుకొన్నయెడల నీబాధపోవునని చెప్పెనువృత్తాన్యలయిరి అప్పుడామెయింటికివెళ్ళినోముపట్టి ఏడాదిప్రతివారముముత్తయిదువకుపెట్టిపడాది అయినతరువాత వుద్యాపనముచేసుకొగా దరిద్రబాధ పోయెను

దీనికివుద్యాపనము:—పదముగ్గురు పేరంటాండ్రుతలంటి నీళ్ళుపోసిపదమూరుడబ్బులుదక్షిణతాంబూలముపదమూరు రవికలగుడ్డలుపెట్టితొలినాడుఅస్తమానమువేళవంటచేసి మూతపెట్టిచద్దిచేసిప్రొద్దున్నే ముత్తయిదువులకుభోజనములుపెట్టి పదమూరు మూకళ్లు ఈవద్దిపెట్టిపదముగ్గురవాయనము యివ్వవలయును కథలోపమయినను వ్రతలోపము కాకూడదు భక్తితప్పినను ఫలముతప్పదు.

## 10. కన్నతులసెమ్మకథ.

ఒకబ్రాహ్మణునకు ప్రథమభార్యకు కూతురుండెను. యిప్పటిభార్యకు ఆచిన్నదానినిచూచిన యిష్టములేదు అందుచేతపిల్లకుఅన్నము పెట్టక తలదువ్వక నానాబాధలుపెట్టుచుండెను ఆపిల్లనవతితల్లిబాధపడలేక తాతగారియింటికి వెళ్ళిపోయెను పిల్లతాతగారియింటికివెళ్ళినతరువాత తండ్రినివెళ్ళితీసుకొనిరావలసినదని ఆపిల్లసవతితల్లిఅడిగెను నీవుఅక్కడవున్నయన్నినాళ్లను బాధపెట్టినావు నేనిప్పుడేమునిదానినితీసుకొనిరాను నేనువెళ్ళనంపనునీవువెళ్ళితీసుకొని రారమ్మనిమాబ్రాహ్మణుడుచెప్పెను ఆమెనరేఅనివెళ్ళిపిల్లను పంపుమనిపిల్లతాతగారి నడిగెనుఅమ్మాయి మామనుమరాలికిపెళ్ళిచేయవలయును యిప్పుడుపంపుటకు వీలులేదని మాతాతచెప్పెను మాపిల్లనుమేమే పెళ్లిచేసుకుంటాముపంపుడని తీసుకొనివచ్చెను ఇంటికితీసుకొనివచ్చినతరువాత నాపిల్లను ఎత్తుకోమని

చెప్పి కొంచెము అరిసెముక్క పెట్టి తాను వెళ్ళి తులసెమ్మకు పూజచేసి
కొనుచుండెను సవతితల్లి పూజచేసుకొని వెళ్ళినతరువాత తానుకూడ వెళ్ళి
పూజచేసుకొని యాపిల్ల చేతిలోని అరిసెముక్క నైవేద్యముపెట్టెను అప్పు
డుతులసెమ్మ ప్రత్యక్షమై నీవుకన్నెతులసెమ్మనోముపట్టిఉల్లంఘనచేసితి
వు అందుచేత నీకు బాల్యములో తల్లిచనిపోయినది ఆకారణముచేతనే
యీకష్టములు కలిగినవి. కాబట్టి యిప్పుడు కన్నెతులసెమ్మనోము నోచు
కొని ఏడాదిఅయినతరువాత ఉద్యాపనముచేసుకొమ్మని చెప్పియామె
యదృశ్యమయ్యెను ఆపిల్లఆప్రకారము నోముపట్టి ఉద్యాపనముచేసుకొ
నగా సవతితల్లికి ఆమెపైని ప్రేమకలిగెను,

దీనికిఉద్యాపనము:—కన్నెపిల్లకు తలంటిపోసి పరికిణీ రవిక
యిచ్చి పదమూడుజోడాలు నేతిఅరిసెలువాయనము యివ్వవలెను మరి
పదమూడుజోడాలు నైవేద్యముపెటవలెను శక్తితప్పినను భక్తితప్పరాదు
కథలోపమయినా వ్రతలోపముకారాదు.

## 11. కాటుకగౌరికథ.

ఊరుగుడ్డి పొరుగుగుడ్డి యింటియిల్లాలుగుడ్డి మాయింటి
బ్రాహ్మణుడుగుడ్డి అనివిచారించుచు ఒకబ్రాహ్మణునిభార్యకూర్చుం
డెను అప్పుడు పార్వతీపరమేశ్వరులు ఆమెకుప్రత్యక్షమై ఏమమ్మా యీ
లాగువిచారించుచున్నావని యడిగిరి మీకెందుకువెళ్ళండిఅని యామె
చెప్పగా మాకేకావలెను ఎందుకోచెప్పవలెనని వారు మరలనడిగిరి ఊ
రుగుగుడ్డి పొరుగుగుడ్డి ఇంటిలోనాడుగుడ్డి మాయింటిఆయనగుడ్డి
అందుచేత ఏడ్చుచున్నానని యామెచెప్పెను నీవు క్రిందటి జన్మమున
కాటుకగౌరినోముపట్టి ఉల్లంఘనముచేసినావు అందుచేత నీలాగుకలిగినది
అప్పుడా కాటుకగౌరిదేవి నోముపట్టి ఏడాది అక్షతలువేసుకొని తరువాత

ఉద్యాపనము చేసుకొన్నని చెప్పిరి ఆమె ఆప్రకారము నోము పట్టి ఉద్యాప
నము చేసుకొనగా అందరికన్నులు వచ్చి సుఖముగానుండిరి.

దీనికి ఉద్యాపనము నోముపట్టినప్పటినుండి ఏకభుక్తములు చేసుకొన్న తరువాత
ముత్తైదువునకు తెలంటిస్నానము పోసి కిరికించుచీరయిచ్చి కాటుకబొట్టిచ్చి
రవికలగుడ్డ దక్షిణతాంబూలము ఇయ్యవలెను శక్తితప్పినను భక్తితప్ప
రాదు కి ఫలలోపమయినను వ్రతలోపము కాకూడదు,

## 12. కార్తీక చలిమళ్ళనోముకథ.

రాజకూతురు ప్రధానికూతురు కార్తీకచలిమళ్లనోముపట్టినారు
ప్రధానికూతురు పట్టినయేడు నీలాటిరేవున వాయనమిచ్చినది నీలాటి
రేవున వాయనమిచ్చినందుకు నిధినిక్షేపము పరమేశ్వరుడామెకు దయచే
సెను మరుచటిసంవత్సరము కొమ్మకింద వాయనమిచ్చెను అట్లుయిచ్చినందు
కు కొమ్మ చేనుగులవంటి కొడుకులను పరమేశ్వరుడామెకిచ్చెను మూడవ
యేట గుడిలో వాయనమిచ్చినది అట్లు యిచ్చినందుకు పార్వతీదేవివంటి
అయిదవతనమునిచ్చెను రాజకూతురుల్లంఘనము చేసినది అట్లు ల్లంఘనము
చేయుటచేనామెకు హీనదశపట్టి మగడెప్పుడు రోగాలతో తీసుకొనుచు
నుండెడివాడు తనతోటిప్రధానికూతురు నకైశ్వర్యములనుభవించుచుం
డగా తానా హీనదశ ననుభవించలేనని యడవులపాలైపోయి పార్వతీపర
మేశ్వరుల ధ్యానము చేసుకొనుచున్నది అట్లామెయుండగా పార్వతీ
పరమేశ్వరుల కనుగ్రహమువచ్చి మారుదంపతులరూపమున నామెకుప్ర
త్యక్షమై యేమమ్మా యిట్లు దుఃఖించుచున్నావని యడిగిరి మీరెందు
కమ్మా అడిగెదువారా తీర్చెడువారా వెళ్ళుడని వారితో నామె పలికెను.
అప్పుడు పార్వతీదేవి పరమేశ్వరునిచూచి ప్రధానికూతురు కార్తీకచలిమి
ళ్లనోము పట్టినది రాజకూతురును పట్టినదిగదా రాజకూతురికీలాగుండడ

పాడుదమని తీసుకొని వెళ్ళుచున్న యాచిన్నదాని పాతివ్రతమును చూచి పార్వతీపరమేశ్వరులు దయగలవారై ముసలివరుసలు వేషములుధరించి ఆచిన్నదియు భర్తయు నున్నచోటికివచ్చి మీరెక్కడికివెళ్ళుచున్నారని యడిగిరి అందుకాచిన్నది మీరార్చేవారా తీర్చేవారా మీకెందుకని చెప్పినది ఆలాగుకాదు అమ్మాయీ ఆర్చేటివారము మేమే తీర్చేటివారము మేమే చెప్పవలసినదని మరలపార్వతీపరమేశ్వరులు అనుగగా భర్త కోసము యమదూతలు వచ్చినారు అందుచేత నాభర్తను అడవిలోనికి తీసుకొనివచ్చి పార్వతీదేవినినడిగి అయిదవతనము తెచ్చుకొందమని వచ్చినాను అనియాచిన్నదిచెప్పెను అప్పుడుముసలిముత్తైదువగా నున్న పార్వతీదేవి యాచిన్నదానినిచూచి అయ్యోయ్యోగుమ్మడిగారి నోముపట్టిపెద్ద ముత్తైదువను నాకువ్యాపనము చేసుకోవమ్మా నీమగనికిగండముగడచి నీకయిదవతనమువచ్చును అనిచెప్పి అడవిలో మూడు గుమ్మడిపళ్ళుకోసి రవికలగుడ్డ పసపుకుంకుమ తాంబూలముగావించి తానాచిన్నదానిచేత వాయనముపుచ్చుకొనెను వాయనము పుచ్చుకొని ఏడాదిగుమ్మడికాయ కూర తినవద్దనిచెప్పి పంపెను ఆచిన్నది తిరిగి యింటికివచ్చి నూరేండ్లు అయిదవతనముతోనుండెను ఈసంగతింతయువిరుగుపొరుగమ్మలు తెలుసు కొనిరి ఆమెపట్టిననోము జగమంతాపట్టిరి శక్తితప్పినాభక్తితప్పరాదుఅక్షం తలుతప్పినా లక్షవేలయేండ్లు అయిదవతనముతప్పరాదుకధలోపమయినా ప్రాణలోపముకాకూడదు

## 14 పువ్వులతాంబూలముల నోముకధ.

ఒకరాజుకూతురి నెప్పుడు మగడేలేవాడుకాడు ఆవిడ సంతానం లేక సిరియొల్లక అడవులనుబట్టిపోయెను పార్వతీదేవి ముసలిముత్తైదువ వేషము వేసుకొనివచ్చి ఏమిబిడ్డా యీలావచ్చితివని యడిగెను ఏమి చెప్పనమ్మా నాస్థితిఅంతాయిదియని తనకధయంతయుచెప్పెనుఅప్పుడు పార్వతీదేవి నేనుచెప్పినట్లు చేయుము అమ్మాయీ నీమగనికి నీమీద

దయవచ్చును తరువాత సంతానములుగును వకలభాగ్యాలు వచ్చు
ను అనిచెప్పెను ఆరాజకూతురామెమాటలకు సంతోషించి యింకకంటె
యేమికావలెను చెప్పుమనియడుగగాపార్వతీదేవి అమ్మాయీనీవుతిన్నగా
యింటికివెళ్ళి ప్రతిదినము అయిదుపువ్వులు తాంబూలములో పెట్టి ఒక
ఏడాది భక్తిశ్రద్ధలతో పార్వతీదేవి పేరుచెప్పి ఒకముత్తయిదువకిచ్చి తరు
వాత పళ్ళెమునిండా పువ్వులుపోసి ఒకబంగారు పువ్వుచేయించి చీర
రవికలగుడ్డ పెట్టి పళ్ళెముతోకూడా ముత్తయిదువకు వుద్యాపనముచేసు
కొనుము అనిచెప్పెను ఆమాటలు విని ఆమెతిన్నగా యింటికివచ్చి భక్తి
శ్రద్ధలతో పార్వతీదేవిపేరు చెప్పి యేడాది పైనచప్పిన ప్రకారము పు
వ్వుల తాంబూలాలిచ్చుకొని ఆపిడచెప్పినప్రకారము వుద్యాపనము చే
సుకొన్నదట అప్పటినుండి ఆరాజకూతురుమొగుడు నీళ్ళు పాలు కలసి
నట్లుకలసి సుఖములనుభవించిరి తరువాత ఆమె ముత్యాలవంటి బిడ్డ
లను కని రత్నమాణిక్యాలు భూషణాలు పెట్టుకొని సుఖముగానుండెను
ఆమెపట్టిననోము లోకమంతయూపట్టిరి శక్తితప్పినాభక్తితప్పరాదు అతు
తలుతప్పినాలక్షవేలవేండ్లు అయిదవతనము వుద్యాపనముకథలోనున్నది.

## 1. గంధతాంబూలాలనోముకథ.

పువ్వులతాంబూలములనోముకథవలెనేదీనికథయునుప్రతిదినము
అయిదు గంధపువుండలు తాంబూలములో పెట్టి యివ్వవలెను.

ఉద్యాపనము—గంధపుచెక్క అకులు పోకలుచీరె రవికలగుడ్డ
ముత్తయిదువుకు ఉద్యాపనము చేసుకోవలెను.



# నోములకథలు నెం॥ 2రు

## 1. ఉదయకుంకుమనోముకథ.

ఉదయకుంకుమనోముపట్టిన ఉవిద యున్నపట్టణమున వెదకినను వెధవలేదు

ఉద్యాపనము—ఒక ముత్తయిదువునకు తెల్లవారకుండాతలయంటినీళ్ళుపోసి తానునూతలఅంటుకొని నీళ్ళుపోసుకొనిచీరరవికెలగుడ్డయు ఆముత్తయిదువునకిచ్చి పిండివంటలతో భోజనముపెట్టి కుంకుమభరణి దక్షిణ తాంబూలము లొసంగి యుద్యాపనచేసుకొనవలెను.

## 2. చిలుకముగ్గులనోముకథ.

ఒకబ్రాహ్మణునకు సంతానము లేకపోయినది. విష్ణుమూర్తిని గురించి తపస్సుచేసినాడు. విష్ణుమూర్తి ప్రత్యక్షమైఅయిదవతనము లేని ఆడదికావలెనా ఆయుర్దాయము లేనిమొగవాడు కావలెనాఅని అడిగెను. అయిదవతనములేని ఆడుదియేకావలెనని అడిగెను ఆప్రకారము నీకుకూతురు పుట్టునని చెప్పెను తరువాత ఆబ్రాహ్మణునకు ఒక ఆడశిశువుకలిగెను తలిదండ్రులు ఆపిల్లకు నారాయణమ్మ అను పేరుపెట్టి ఆమెవివాహముగూర్చి విచారించుచుండిరి ఎవరూచేసుకొన్నారుకారు తలిదండ్రులు విచారిస్తూ అడవిలోనికి వెళ్ళిఒకరాతికి పెండ్లిచేయుదమని తలచిరి అప్పుడు అడవిలో ఒకకృష్ణవిగ్రహము కనపడగా దానికి వివాహము చేసిరి. ఆవిగ్రహము బద్దలై పిండిఅయిపోయెను అప్పుడాచిన్నది విచారించుచు ఇంట్లోనికి వచ్చి విష్ణుమూర్తినిగురించి తపస్సుచేస్తూయుండేది కొన్నాళ్ళకుతలిదండ్రులుచనిపోయిరి ఆచిన్నదరోజూతపస్సుచేసూయెవరికి యేమీ పెట్టకుండా నాయింటికి రాకండి నారాయణ నన్నెవరు అడగకండి నారాయణఅని అంటూవుండేది అందరూఆచిన్నదానిని యిలోనారాయణమ్మఅని పేరుపెట్టిరి కొన్నాళ్లకు ఆమెకుఅవసానకాలము

వచ్చెను అప్పుడు నారాయణమూర్తి కాకి అయి వచ్చి కావుకావు
మని అరచుచుండెను అందుకామోపరింగి అలుకుతూవున్న అలుకుగుడ్డ
పుచ్చుకొని కొట్టెను విష్ణుమూర్తి ఆగుడ్డ పుచ్చుకొని వెళ్లగా అంతలో
ఒక కందిగింజదొరికెను ఆ గింజముక్కునవైచెను అది మొలచి చెట్టు అయ్యే
సరికి నారాయణమ్మ చనిపోయెను అప్పుడు విష్ణుమూర్తి దానిని తీసు
కొనిపోయి అలుకుగుడ్డకట్టియనియున్న ఆచెట్టుక్రిందవుంచుమని చెప్పెను
అందుకాచిన్నది విచారిస్తూ నేను నీకు భక్తురాలిని నన్నిట్లు చెయ్య
వచ్చునా అని అడుగగా నీవు మొదటి దానధర్మాలు చేసుకోలేదు
అందుచేతనీవు యిట్లాతటస్థించినదని చెప్పెను ఆచిన్నది పుష్పై ఆ
చెట్టుమీదకొన్నాళ్ళు వుండగా తిరుగవిష్ణుమూర్తి ప్రత్యక్షమయి నా
భార్య చిలుకుమాగ్గుల నోముపట్టును అప్పుడు చిన్న పిలుచుటకువచ్చె
ను అప్పుడు ఒకబిందువునాకుధారపోస్తె వస్తానని చెప్పుము అప్పుడు నీకు
మేలుకలుగుతుందని చెప్పెను ప్రాగము లక్ష్మిదేవి చిలుకుమాగ్గుల
నోముపట్టగాలోనారాయణమ్మను పిలుచుటకువచ్చెను అప్పుడువిష్ణు
మూర్తి మహిమచేత ఆచిన్నదివ్యవిగ్రహమై ఒకయింట్లోదిగివుండెను.
అప్పుడు లక్ష్మిదేవి అమ్మాయి నేను చిలుకుముగ్గులనోము పట్టును రా
వలసినదనికోరెను అందుకాచిన్నది అమ్మాగారికొక బిందువు ధారపోసే
వస్తాను లేకపోతేరానని చెప్పెను ఆప్రకారం ధారపోసెదనని లక్ష్మి
దేవిచెప్పెను అప్పుడు ఆచిన్నదానిని తీసుకొనివచ్చి చిలుకుముగ్గులనోము
పట్టి చిలుకతొక్కి ఒకబిందువు ఆచిన్నదానికిధారపోసెను అప్పుడు ఆ
చిన్నదానికి సమస్తదోషములుపోయెను అప్పుడు విష్ణుమూర్తి నీకువేమి
కావలెనని అడుగగా నాకు నీపాదసేవకంటె ఏమిఅక్కరలేదని చెప్పెను
లక్ష్మిదేవి ఆమెకుఎప్పుడు అయిదవతనమువుండేలాగు వరమిచ్చెను నారా
యణమూర్తి ఆచిన్నదానిని ఎప్పుడు తనస్వర్గములో సుఖముగానుండు
టకు సెలవిచ్చెను ఈనోమునోచుకొన్నవాళ్ళకున్ను భోజనానికి వెళ్ళిన

కాశ్యపుణ్ణు నిత్యనువానినిశ్వముకలిగి నిత్యైశ్వర్యము గలుగునని విష్ణుమూర్తి చెప్పెను.

దీనికి ఉద్యాపనము—ఈనోము అయిదేళ్ళు నోచుకొని అయిదో సంవత్సరము గాని లేక అయిదేళ్ళలోగా గాని అయిదుమానికల బియ్యము వలియిడిచేసి అద్దెమత్తెవ్వనుబియ్యము అప్పాలుచేసి శక్త్యానుసారముగా అయిదుగురు ముత్తయిదువులకు పదియేనుగురు బ్రాహ్మణులకు పదిహేనుకలశలు పదిహేను అంగవస్త్రములు ముత్తయిదువులకు చీరలు రవికలగుడ్డలు ఇచ్చి భోజనము పెట్టి దక్షిణతాంబూలము ఇచ్చి ఉద్యాపనము చేసుకోవలెను. శక్త్యానుసారముఏటా సంపూర్ణ చేసుకోవచ్చును భక్తి తప్పినా ఫలముతప్పదు కిధలోపమైనా వ్రతలోపము కాకూడదు

## 2 పోలిస్వర్గమునకు వెళ్ళుకథ,

అనగనగా ఒక చాకలిది దానికి నలుగురు కొడుకులు నలుగురు కోడళ్ళుకలరు ఆచాకలిది ముగ్గురు కోడండ్రుతాను ప్రతిరోజు కార్తీకమాసములో ఆశ్వయుజబహుళ అమావాశ్య మొదలు ఉదయము కాకుండా స్నానముచేసుకొని దీపముపెట్టి నెలరోజులాతీరుగాజరిపెను తరువాత కార్తీక బహుళఅమావాస్యనాడు తెల్లవారుజామున లేచి కడసారపు కోడలితో మేముస్నానమునకు వెళ్ళుచున్నాము మేము వచ్చేవరకు ఇంటివద్దజాగ్రతగా నుండవలసినదని చెప్పి చాకలిది ముగ్గురు కోడండ్రు స్నానమునకు వెళ్ళిరి అప్పుడు చిన్నకోడలు లేచి చల్లచేసిన కవ్వమును [illegible]యున్న వెన్న ఊడ్చుకొని పత్తి చెట్టుక్రింద పడియున్న ఒక పత్తికాయ తెచ్చుకొని నూతివద్దస్నానముచేసి దీపమువెలిగించుకొని అత్తగారురాకుండా దీపమునీద చాకలిబానమూత వేసెను అప్పుడు దానికి ఆకాశమునుండి విమానమువచ్చెను అదివిమానము నెక్కిబొందితోకూడా స్వర్గమునకు చక్కా వెళ్ళుచుండెను ఈవెళ్ళడముఏటిరొడ్డునం

దీపములు పెట్టుకొనుచున్న వాళ్లందరూచూచి చాకలిపోలి స్వర్గమునకు వెళ్ళుచున్నది అని అందరు ఆశ్చర్యపడసాగిరి అంత మాకోవలేమిటి స్వర్గమునకు వెళ్లడమేమిటి చాకలిది దానిముగ్గురికోడండ్రును ఆశ్చర్యముతో చూచిరి. ఆలాచూచి ఆవిమానముమీదనుండి వచ్చేవాని కాళ్ళు పలుగురు పట్టుకొనిరి. అప్పుడువిష్ణుమూర్తి వచ్చి ఈకోడలిని వదలిపెట్టి వాళ్లను ముగ్గురును పెట్టుకొని అశ్రద్ధగా భక్తి లేకుండా దీపాలుపెట్టుచున్నావు ఇదిశ్రద్ధగాభక్తులతో పెట్టుచుండగాబట్టి దీనికి బొందితో స్వర్గము నిచ్చినాను నీవు అపవ్రులపాలై పోవలసినదని శాపముపెట్టి చక్కాపోయెను ఈకథ చెప్పి అక్షింతలు వేసుకోవలయును.

### 4 నిత్యశృంగారముకథ.

రాజుభార్య మంత్రిభార్య నిత్యశృంగారమునోము పట్టిరి. రాజుభార్య సఖులచేత తాంబూలము బొట్టు పెట్టించుచుండెను మంత్రిభార్య యట్లుగాక తానే స్వయముగా బొట్టుపెట్టి తాంబూలము నిచ్చుచుండెను. ఈలాగునివ్వగా నామెకు కడుభాగ్యమబ్బినది. రాజుభార్యకు అశ్రద్ధగా నివ్వడముచేత దరిద్రమునంభవించెను అందుకలన నామెయొకనాడు మిక్కిలిదుఃఖించుచు కూర్చుండెను. ఇట్లుండగాపార్వతీపరమేశ్వరులు ఆమెకు ప్రత్యక్షమయి యెందు కేడ్చుచున్నావమ్మా అనియడిగిరి ఆర్చెడివారా తీర్చెడివారా మీకెందుకు వెళ్లండిఅని యామె వారితో ననెను అంతట వారు ఆలాగుకాదు ఆర్చెడివారంమేమే తీర్చెడివారంమేమే దుఃఖకారణమేమో చెప్పవలసినదిఅనియడిగినారు మంత్రిభార్యయు నేను నోముపట్టినాము ఆమెకుభాగ్యమువచ్చినది నాకుదరిద్రమువచ్చినది ఎందుచేత నాకీదరిద్రమువచ్చెనో తెలియక దుఃఖించుచున్నాను అనియామె చెప్పెను నీవుదాసీజనంబుచే వ్రతకృత్యములు జరిపించినావు అందుచేత నీకీలాగున దరిద్రమువచ్చినది మంత్రి భార్య శ్రద్ధగా తానే స్వయముగాచేయుటచేత నామెకుభాగ్యములభించెను నీవుతిరిగి యీనోము

పట్టి కథ చెప్పుకొని అక్షతలువేసుకొని ఏడాదికొద్దిగా తాంబూలమిచ్చు కొంటే సిరిసంపదనీకువచ్చునని చెప్పి అపురాణదంపతులద్రుశ్యులైరి అప్పు డీనోము పట్టి ఏడాదికథచెప్పుకొని అక్షతలు వేసుకొని రోజునుఒకముత్త యిదువకు బొట్టుపెట్టి తాంబూలమిచ్చి అద్దముదువ్వెన చూపించి ఏడాది అయిన తరువాత నామెయుద్యాపనము చేసుకొని సిరిసంపదలను బడ సెను.

ఉద్యాపనము—ఒకముత్తయిదువునకు తలంటి నీళ్ళుపోసి చీర రవికయిచ్చి భోజనముపెట్టి బొట్టుపెట్టి అద్దము దువ్వెన కాటుకకాయ కుంకుమభరణి నవరము గంధమచెక్కయిచ్చి ఉద్యాపనము చేసుకో వలెను.

## 5 తవుడుగౌరి.

తవుడు గౌరి పట్టిననఖయకు తల్లి తండ్రి అత్తమామ యేవేళనక బాయకుండ నుండెడివారు తల్లి తండ్రి అత్తమామకూడా యెడబాయ కుండా ఉన్నారు నీవు యేమినోముపట్టినావమ్మా అని అందరుఅడిగినారు యేమిలేదమ్మా క్రిందటిజన్మమున నాయమ్మ తవుడుగౌరినోముపట్టి ఉద్యాపనముచేసికొన్నది అందుకున్న ఫలమేగాని పట్టినఫలముగాదు అనిచెప్పెను. అందుకంటెనే ఇంతఫలము కలిగెను పట్టినట్టయిన నెంత ఫలమువచ్చునో అని కలియుగమంతా తవుడుగౌరినోముపట్టి ఉద్యాపన చేసికొన్నారు.

ఉద్యాపనము—బియ్యముపోసిన యీతవుడపోసి శక్తియుంటే చీరనుంచి లేకపోయిన రవికలగుడ్డ దక్షిణ తాంబూలముంచి యుద్యాప నము చేసుకోవలెను.

## 6. పంచు పూవులనోముకథ.

శివా మహాదేవా సింహద్వారము గడచి వచ్చితిని దేవా మూటిలో మునుగువేయకుండా నోచితిని దేవా అధవస్నానమున అల్లు

ఇంటికి వెళ్ళకుండా నోచితినిదేవా ఒకపూవు పూజచేసితినిదేవా ఉత్త
యైన బ్రాహ్మణకడుపున బుట్టనోచితినిదేవా రెండుపూవులు పూజచేసి
తినిదేవా సుపుత్రి సావిత్రి కలుగనోచితినిదేవా మూడుపూవుల పూజ
చేసితినిదేవా ముత్యాలకోడుగునీడ నడవనోచితినిదేవా నాలుగుపూవులు
పూజచేసితినిదేవా నవధాన్యరాశులింటికి రానోచితినిదేవా అయిదు
పూవులుపూజచేసితిని ధరణీదేవివంటితల్లిదండ్రులు రానోచితినిదేవా ఆరు
పూవులుపూజచేసితినిదేవా ఆదిత్యభగవానులవంటి అన్నదమ్ములు రానో
చితినిదేవా ఏడుపువ్వులపూజచేసితినిదేవా ఏకచక్రముగ నేలనోచితిని
దేవా ఎనిమిదిపూవులపూజ చేసితినిదేవా ఎనమండుకంసాలులు చేసిన
సొమ్ములు ఎడతెగకుండా పెట్టనోచితినిదేవా తొమ్మిదిపూవుల పూజచేసి
తినిదేవా తోయజగంధులు తోడుగానోచితినిదేవా పదిపూవులపూజ
చేసితినిదేవా పట్టపురాజునకిష్టమయినదేవినిగానోచితినిదేవా పదకొండు
పూవులు పూజచేసితినిదేవా నాయకపురుషుడు పరస్త్రీని చూడకుండా
నోచితినిదేవా పండ్రెండుపూవులు పూజచేసితినిదేవా ఎక్కువఅయిదవ
తనము మిక్కిలిసంపదా కలుగనోచితిని దేవా పదమూడుపూవులపూజ
చేసితినిదేవా పార్వతీసాన్నిధము పడయనోచితిని దేవా మెచ్చితిని అక్కా
యిచ్చితినివరము మరియొకటికోరవే మహేశలింగము శివభక్తురాలాకోర
నేమున్నదయ్యా ఇష్టసంపదలకు ఇద్దరుకుమారులనుకోరితి పార్వతీదేవి
వంటిది కూతురు లక్ష్మీదేవివంటి కూతురు మెచ్చితిని అక్కాయిచ్చితిని
వరముమరియొకటికోరవే మహేశలింగము శివభక్తురాలా కోరనేమున్న
దయ్యా మాననేమున్నదయ్యా పదముగ్గురు కొడుకులనునోచితిని మువ్వ
లాడుకొడుకు అందెలాడుకొడుకు అమ్మా అన్నముపెట్టుమనేవాడుకొడుకు
ఉగ్గుపోయుమన్నవాడు కొడుకు పడమట భారతము చదువువాడుకొడుకు
ఉత్తరాది నూళ్ళేలువాడు కొడుకు దక్షిణాది ద్వారమెత్తినవాడు కొడుకు
గోవునుదెచ్చిదొడ్డిపెట్టి గోదానము చేయుమనేవాడు కొడుకు అన్నము

పండించి రాసిజేసి అన్నదానము చేయుమనువాడు కొడుకు కన్నెలనుగని
దగ్గరపెట్టి కన్యాదానము చేయుమనువాడుకొడుకు సువర్ణముదెచ్చి పళ్ళె
రములనుంచి సువర్ణదానము చేయుమనువాడుకొడుకు వస్త్రములుతెచ్చి
దండెములవేసి వస్త్రదానము చేయుమనువాడుకొడుకు. ఇటువంటికొడుకు
లను పదముగ్గురు కొడుకులను గోంటిని దేవా మెచ్చితిని అక్కా యిచ్చితిని
వరము మరియొకటికోరవే మహేశలింగము శివభక్తురాలా కోరనేమున్న
దయ్యా మానవేమున్నదయ్యా సోమయాజులగారి సోమిదేవమ్మ పెళ్ళి
కూతురునై పుట్టివేగివేసిన వేయిపుట్లరాజనాలు పదిపుట్లఅపరాలు అంద
యిదుపుట్లజీలకర్ర పందుముడుప్ప ముద్దిడింగున సిద్దెడునెయ్యి పెరుగాకు
పెరుగుపోక గుమ్మిడికాయంతనున్నము పదికడవలపాలు యిరువయికడ
వల పెరుగు చద్దికంచాలక్రింద చెల్లగోంటిని దేవా మెచ్చితిని అక్కా ఇచ్చి
తిని వరము మరియొకటికోరవే మహేశలింగము శివభక్తురాలా కోరనేము
న్నదయ్యా మానవేమున్నదయ్యా సోమయాజులగారి సోమిదేవమ్మ పెద్ద
కోడలునై వేగివేసిన వేయిపుట్ల రాజనాలు పదిపుట్ల అపరాలు అయిదు
పుట్లజీలకర్ర పందుముడుప్ప ముద్దిడింగున సిద్దెడునెయ్యి పెరుగాకు
పెరుగుపోక గుమ్మడికాయంతనున్నము పదికడవలపాలు యిరువయి
కడవలపెరుగు వేసిపళ్ళరాలక్రింద చల్లగోంటినయ్యా దేవా మెచ్చితినక్కా
ఇచ్చితిని వరము మరియొకటి కోరవే మహేశలింగము శివభక్త
రాలా కోరనేమున్నదయ్యా మానవేమున్నదయ్యా తల్లిలేకనితల్లి తల్లి
తానుమూడుతోటలపూవులు ముడుచుకొని ఆరుతోటలపసపు రాసుకొని
మనిమనములను చంకబెట్టుకొని పట్టిమంచము పసుపుమీద పరుండగోంటి
నయ్యా దేవా మెచ్చితిని అక్కా యిచ్చితిని వరము మరియొకటికోరవే
మహేశలింగము శివభక్తురాలా కోరనేమున్నదయ్యా మానవేమున్న
దయ్యా అత్తగారత్తగారు అత్తగారు తాను మూడు తోటలపూవులు
ముడుచుకొని ఆరుతోటల పసుపు రాచుకొని మనమలను చంకబెట్టుకొని

పువ్వులపాన్పుపయి పరుండగోరితిని దేవా పెద్దింటినిలకూ యిచ్చితిని వరము మరియొకటికోరవే మహేశలింగము శివభక్తురాలా కోరనేమున్న దయ్యా మానసేమున్నదయ్యా పదుపువ్వులనోముపట్టినపదతివద్దకు కదగండికాళ్ళు వేయుసికద్ద పూలతోటలోకి దీసికొనివెళ్ళి పురాణపుస్త కములు విప్పిచూపించండి యేలాగువచ్చినదియో యెటువచ్చినదిసీలాంబ రము నిలచియేవచ్చినదియో కనకాంబరమున కదలివచ్చినదియో కళ్ల చీరలో వెలసియే వచ్చినదియో అలాగే వచ్చినదియో అటువచ్చినదియో ఉద్దండపురుగులుపడకుండా అనుపముక్కులకాయలు పాడవకుండా పదు పువ్వులనోముపట్టిన పదతికిస్వర్గమునకు తలుపులుతీసిపెట్టండి ఆమెనోచిన నోము భూలోకమంతయు నోచినారు శక్తితప్పినా భక్తితప్పరాదు అక్షింతలుతప్పినా లక్షవేలఅయిదవతనము

నోముపట్టెడువిధానము:—నోముయింకపట్టెదరనగానిత్యమల్లె చెట్టునో మరియేదయినా పువ్వులచెట్టునో దొడ్డియందువేసుకొని ప్రతి రోజును పదమూడుపువ్వులగౌరిదేవిపూజచేసుకోవలెను. రోజుకొకమారు కథ చెప్పుకోవలెను. పదమూడుపద్మములు పదమూడువత్తులదీపము పదా మూడు ప్రదక్షిణాలు.

ఉద్యాపనము:—పదమూడు దోసిళ్ళ బియ్యము పదమూడు బంగారుపువ్వులు పదమూడుకాసులుదక్షిణ శివాలయమునకు పట్టుకొని వెళ్ళి శివలింగమునకు పూజచేయవలెను.

## 7. నిత్యతాంబూలములనోముకథ.

పువ్వుల తాంబూలముల నోముకథవలెనే దీనికథయును నిత్యము ఒక తాంబూలము బ్రాహ్మణునికియ్యవలెను.

ఉద్యాపనము:—వెండికు భరిణి పైడి చెక్కచేయించి ఆకులు

పోళలు పాండానులో పెట్టి పాండానుతోకూడా బ్రాహ్మణునకియ్య వలెను

## 8. పసుపుతాంబూలము కథ.

దీనికథయు పువ్వులతాంబూలములనోముకథవలెనే ప్రతిదినము అయిదుపసుపుకొమ్ములు తాంబూలములోవుంచి ముత్తయిదువునకిచ్చు చుండవలయును.

ఉద్యాపనము:—పీసెడేబులం పసుపు పీసెడేబుల కుంకుమ చీరరవికల గుడ్డ తాంబూలము పళ్ళెములోనుంచి ముత్తయిదునకు ఇయ్యవలయును శక్తితప్పినా భక్తితప్పరాదు అక్షతలుతప్పినా లక్షవేలుయేండ్లు అయిద నతనము.

## 9. పోలాలఅమావాస్యకథ.

ఒకబ్రాహ్మణునకు ఏడుగురుకొడుకులు ఏడుగురుకోడండ్రు కల రు ఏడుగురుకోడండ్రుపోలాల అమావాస్యనోము నోచుకొందామని య త్నముచేసుకొనిరి అంతటకడసారపుకోడలికి అమావాస్యరోజున ఒకపిల్ల చచ్చిపోయెను ఆకారణముచేత అయేటికిఆనోముఅంతా మానివేసిరి అ దిమొదలుప్రతిసంవత్సరము పీళ్ళంతానోమునోచుకుందామని యత్నము చేయుచుండుటయు అమావాస్యవచ్చేనరికి కడసారపుకోడలికిపుట్టినపిల్ల చచ్చిపోవుచుండుటయు తటస్థించుచుండుటచేత వాళ్ళకానోము పట్టుటకే పీలులేకపోవుచుండెను యిట్లుయేడేళ్ళుఅయినతరువాత ఏడేటియీకడసా రపుదానికి పుట్టచావ అనిలిట్టకుంటూకోడండ్రంతా మళ్ళీయత్నముచేసు కొనిరి అమావాస్యవచ్చేనరికి సరిగాకడసారపుకోడలికి ఒకపిల్లమళ్ళీచచ్చి పోయెను అంతాతిట్టిపోతారనిచెప్పి చచ్చిపోయినపిల్లను ఇంటిలోపెట్టి తాళమువేసుకొని కడసారపుకోడలు అందరతోటికోడండ్రయింటికి వ చ్చెను ఆందరికితలాయొకపని సాయముచేసెను తరువాతఒకరియింటిలో పిండి పప్పు మొదలయినవి తెచ్చుకొనియింటికి వచ్చి చచ్చినపిల్లను

యింట్లో పెట్టుకునే తానుకూడా నోమునోచుకొనెను ఆరాత్రిదాకా
చీకటిలో చచ్చినపిల్లను బుజముమీద వేసుకొని పోలేరమ్మగుడివద్దకు వె
ళ్ళి ఆపిల్లను అక్కడపెట్టి ఏడ్చుచుండెను ఇంతలో అమ్మవారు గ్రామసం
చారము వెళ్ళి గుడివద్దకువచ్చి యేడ్చుచున్న యాచిన్నదానినిచూచి ఏమ
మ్మా యీలాయేడ్చుచున్నావని యడిగెను అందుకాచిన్నది యేడేండ్ల
నుండి యేడుగురుపిల్లలను ఈయమ్మవారికి అప్పగించుచున్నాను ఈయే
డుకూడా యీపిల్లచచ్చిపోయింది తోడికోడండ్రు గిట్టిపోతారని బొంద్ద
టనుండి దాచి అవ్వాడు తీసుకొనివచ్చి యిక్కడపడవేసి యేడ్చుచున్నా
నని చెప్పెను అప్పుడుఅమ్మవారు కరుణించి నీపిల్లలకుమరేమీభయము
లేదు నేనుతీసుకొనివచ్చియిస్తానని చెప్పి అక్షతలుఆచిన్నదానిచేతిలోపో
సి నీవుపిల్లలనుపెట్టినచోటికి వెళ్ళి పిలువుమని చెప్పెను ఆమె ఆప్రకార
ము ఆవిపుచ్చుకొని ఆఅక్షతలు చల్లి అందెలాడ రారా మువ్వలాడ
రారా అనిపగనగా యేడుగురినిపిలువగా అందరువరుసగాలేచి చక్కా
వచ్చిరి ఆమెసంతోషముతో ఆపిల్లలను తీసుకొని యింటికివెళ్ళెను తెల్ల
వారినతరువాత అందరుచూచి అయ్యోయిదేమిటమ్మా ఈపిల్లలెక్కడ
నుంచి వచ్చినారని యడిగిరి ఆచిన్నదివారందరితోను రాత్రిచేసినపనులు
చెప్పి పోలేరమ్మదయవలననీరు బ్రతికివచ్చినారనిచెప్పెను అంతటినుంచి
ప్రతిసంవత్సరము ఈయమావాస్యకు తప్పక నోము నోచుకొని అందరు
యీకథ చెప్పి అక్షతలువేసుకొనుచుండిరి అందుకాఅమ్మవారు సంతాన
మిచ్చి సంతానముకలవారికి కడుపుచలువయిచ్చి రక్షించెను.

## 10. చిట్టిబొట్టుకథ.

చిట్టిబొట్టుపట్టవలె సిరిగలయింటపుట్టవలె ఏడుగురన్నల తోడబు
ట్టవలె ఏకచక్రముగా నేలవలె పదుగురన్నలతోడ బుట్టవలె పట్టభద్రుని
పట్టవలెను.

మాఘపూర్ణిమందు రథసప్తమినాడు ఈకథ చెప్పి అక్షతలు వేసుకొనివెనా దిదాక అయిదుగురి ముత్తయిదువులకు ప్రతిదినమున బొట్టుపెట్టుకొనుచు ఏడాదినిండినతరువాత ఉద్యాపనముచేసుకొనవలయును.

ఉద్యాపనము— అయిదుగురు ముత్తయిదువులకుతలంటినీళ్ళుపోసి పిండివంటలచే భోజనముపెట్టి బంగారపుబొట్లుచేయించి అయిదుగురు ముత్తయిదువులకు అయిదుబొట్లులు అయిదురవికలగుడ్డలు దక్షిణ తాంబూలము నిచ్చి నల్లపూసలు లక్కజోడు యివ్వవలెను కథలోపమయినను వ్రతలోపముకారాదు భక్తితప్పినా ఫలముతప్పదు.

## 11. పసుపుగౌరి.

నూరుపసుపునోచినభామకు నూరువేలేండ్లుఅయిదవతనము కోట్లపసుపు నోచినభామకు కోటివేలయేండ్లు అయిదవతనము ఈకథ చెప్పి అక్షతలువేసుకొని యేడాదిఅయినతరువాత మానెడుసోలెడుపసుపు క్రొతురుపెట్టెలోపోసి రవికలగుడ్డ దక్షిణతాంబూలము నల్లపూసలు లక్కజోడు తోడముత్తయిదువునకు వాయనమువివ్వవలెను పసుపునరగదీసి గిన్నెనిండబెట్టి రవికలగుడ్డ దక్షిణతాంబూలము నల్లపూసలు లక్కజోడు పెట్టి ముత్తయిదువకివ్వవలెను కథలోపమయినా వ్రతలోపముకారాదు. భక్తితప్పినా ఫలముతప్పదు.

## 12. ఉప్పుగౌరి.

దాకనిండా ఉప్పుపోసి దేకినదాక అయిదోతనము క్రొత్తకుండలో మానెడుసోలెడు ఉప్పుపోసి రవికలగుడ్డవాసినకట్టి దక్షిణ తాంబూలముతో ముత్తయిదువకిచ్చి ఉద్యాపనముచేసుకోవలెను ఏడాదిదాక ఈకథ చెప్పి అక్షతలువేసుకోవలెను.

## 13 చిత్రగుప్తునినోముకథ.

ఒకరాజుభార్య మంత్రిభార్య బ్రాహ్మణముత్తయిదువలకు పెట్టుకొని నోములువ్రతములుచేయుచుండెడివారు ఆవ్రతములలో మరువకుండ

మంత్రిభార్య చిత్రగుప్తునినోమునోచెను రాజుభార్య అవ్రతము పట్టి మానివేసెను కొన్నాళ్ళకు మంత్రిభార్య చచ్చిపోయెను చిత్రగుప్తుడు ఆమెపాపములు విడిచిపెట్టి యీయామె అంతయు పుణ్యమే చేసినదని చెప్పి యామెకు పుణ్యలోకప్రాప్తిని కలిగించెను పిమ్మట రాజుభార్య చచ్చి పోయి చిత్రగుప్తునియొద్దకు వెళ్ళగా ఈమెఅంతయు పాపమేచేసినదని చెప్పెను ఆమెకామెనుఃఖించుచు నేనును మంత్రిభార్యయు సమముగా వ్రతములు నోచుకొన్నాము ఆమెకు పుణ్యమువచ్చి నాకుపాపమెందు కువచ్చినదని యాచిత్రగుప్తునడిగెను. అప్పుడు మంత్రిభార్యవచ్చి నీవు చిత్రగుప్తునినోము పట్టలేదు అందుచేతనీకు నరకంవచ్చినదని చెప్పెను అందుకు రాజుభార్య నేనిప్పుడేమిచేసిన నాకీనరకబాధ తప్పునో చెప్ప వలెనని అడిగెను చిత్రగుప్తునినోముపట్టి ఏకాదశులు వేసుకొని ఎద్దుతొక్కనివడ్లు అయిదుకుంచములు కట్టులేనిగంపలో పోసి అయిదు మూళ్ళ పట్టుపంచె అడ్డెడుతవ్వెడుబియ్యము ఒకగుమ్మడిపండు యథా శక్తి దక్షిణ తాంబూలములుపెట్టి వెండిఆకు పైడిగంటమునుంచి తోడ బుట్టినవానికయినను గ్రామకరణమునకయినను అందియ్యవలయునని చెప్పెను. కథలోపమైనా వ్రతలోపముకాకూడదు భక్తితప్పినా ఫలము తప్పదు

## 14. మునికార్తీకవ్రతము

ఒక బ్రాహ్మణుని పెండ్లాము మునికార్తీకదీపమునోము పట్టి ఉల్లంఘనచేసెను అందువలన ఆమెకు దరిద్రమును కడుపు శోకమును వచ్చెను అదిభరింపజాలక బ్రహ్మదేవునియొద్దకువెళ్ళి వరమడిగి తెచ్చు కొంటానని ఆమె బయలుదేరి వెళ్ళుచుండగా త్రోవలోనొక బ్రాహ్మ ణుడు కనపడి ఎక్కడకువెళ్ళెదవమ్మా అని యడిగెను నేను బ్రహ్మదేవుని యొద్దకు వెళ్ళుచున్నాను అనియామె చెప్పెను అప్పుడా బ్రాహ్మణుడు అమ్మానాదికూడా ఒకమనవియున్నది చెప్పుమనియడిగెను అదియేమి

టో చెప్పుమని ఆమెయడుగగా పదునెనిమిది జన్మములనుండి అన్నపా
నములు లేక యీలాగునున్నాను అనిచెప్పెనని యాబ్రాహ్మణుడు చె
ప్పెను సరేయనియామె కొంతదూరమువెళ్లగా అక్కడ పండ్లతోనున్న
ఒక ముంతమామిడిచెట్టు కనపడి అమ్మా ఎక్కడికివెళ్ళుచున్నావని య
డిగెను నేను బ్రహ్మదేవునియొద్దకువెళ్ళి వరముతెచ్చుకొనుటకయి పో
వుచున్నానని యాబ్రాహ్మణి చెప్పగా అమ్మా నాదకూడ ఒకమనవియు
న్నది అని యాచెట్టుచెప్పెను అదయేమిటో చెప్పుమనియావిప్రునిభార్య
అడుగగా మూడుపురుషాంతరములనుండి నిండిపండియున్నాను ఎవ్వరూ
ఒక పండయినా కోసుకొనితినరు అదఎందుచేతనో అడిగిరమ్మనిచెప్పెను
అంతట బ్రాహ్మణునిభార్య బయలుదేరి వెళ్ళుచుండగా కొంతదూరము
వెళ్ళేసరికి ఒకఆవు గూడమొలబంటిగడ్డిలో మేయకుండా నిలబడియుండి
అమ్మా ఎక్కడికివెళ్ళుచున్నావని యడిగినది అప్పుడా బ్రాహ్మణస్త్రీ
బ్రహ్మదేవుని యొద్దకు వరములు తెచ్చుకొనే నిమిత్తము వెళ్ళుచున్నా
నని చెప్పగా అమ్మా నాది ఒకచిన్నమనవియున్నది అడిగిరావలయున
ని యది చెప్పెను అదియేమిటనియామె యడుగగా యీలానిలబడియు
న్నాము యీసంగతియేమిటోకనుక్కొని రావలయునని చెప్పెను సరే
అని ఆమెమరల కొంతదూరమేగుసరికి నిండాపువ్వులతో ఒకమల్లెఅంటు
ఆమెకుకనబడి అమ్మా ఎక్కడికివెళ్ళుచున్నావని యామెనడిగెను బ్ర
హ్మయొద్దకు వెళ్ళి వరముతెచ్చుకుంటాను అనియామెచెప్పగా అమ్మా
నాదకూడ ఒకచిన్నమనవియున్నది చెప్పుమనెను ఆలాగేఅని ఆమెకొం
తదూరమువెళ్ళగా ఒకచోట వెనురుదగ్నిమున కోకలు తగులబడుచుం
డెను అదిచూచి యామె మరికొంతదూరము వెళ్ళువరకు అక్కడ అట్ల
పెనములు అంటుకొని మండుచుండెను అదిచూచిమరికొంతదూరము వె
ళ్ళేసరికి బ్రహ్మలోకముకనబడెను అప్పుడామె బ్రహ్మలోకము లోనికి
వెళ్ళి బ్రహ్మకెదురుగా నిలబడెను ఆమెనుచూచి బ్రహ్మ ఏమమ్మా యీ

లాగువచ్చినావు అనియడుగగా దరిద్రముచేతను కడుపుశోకము చేతను
బాధపడలేక యీలావచ్చినానని చెప్పెను నీవుక్రిందటిజన్మమున మును
కార్తీకదీపములనోముపట్టి ఉల్లంఘనచేసినావు ఆకారణముచేత నీకీదరి
ద్రమున్ను కడుపుశోకమున్ను వచ్చినది ఇప్పుడుమరల యింటికివెళ్ళి ము
నికార్తీకదీపములనోముపట్టి మూడుకాన్తులునమముగావెలిగించుకొంటే
అన్నీబాగావుంటవిఅని బ్రహ్మచెప్పెను అప్పుడామె నరేకాని ఒకబ్రా
హ్మణుడు పదునెనిమిదిజన్మములనుండి అన్నపానములులేకుండాఉన్నాడు
ఎందుచేతనని యడిగెను ఆబ్రాహ్మణుడుబాగా వేదముచదువుకొన్నాడు
ఎవరికి ఒకముక్కఅయినాచెప్పినాడుకాడు అందుచేత ఆయోగ్యతకలిగిం
ది కాబట్టినీవువెళ్ళేటప్పుడు ఆయనతో రాముఅనుమాటచెప్పి వెళ్ళమని
బ్రహ్మదేవుడుచెప్పెను త్రోవలోఒకముంతమామిడిచెట్టుపండ్లుపండియు
న్నది దానిపండ్లెవ్వరును కోసుకొనితినరట ఎందుచేతననియామె యడు
గగా ఒకముత్తైదువ పదిమందికొడుకులతల్లి ఒకపిల్లవానిని పెంపియ్య
మనగా ఇచ్చినదికాదు ఆకారణముచేత వంశముపోయినది ఆశాపము
తగిలి ఆమెచెట్టయిపుట్టింది నీవువెళ్ళేటప్పుడు ఒకపండుతిని చక్కావెళ్లమ
ని బ్రహ్మచెప్పెను. త్రోవలో నొకయావు దూడ ములుబంటిగడ్డిలో
మేతమేయకుండ నిలుచుండియున్నవి ఎందుచేతనని యామెయడుగగా
అత్త కోడలును ఆవునకుదూడకు గడినీళ్లుపోయుటకు వంతులాడి నీవేపో
సినావంటే నీవేపోసినావని పోయుటమానివేసినారు అందుచేత వారలి
ద్దరును ఈలాపుట్టి గడ్డిమేయకుండా చలించియున్నారు నీవు వెళ్ళేసమయ
మందు గుప్పెడుగడ్డితీసివానికి వేసి యిన్నినీళ్ళుపోసి మరివెళ్లమని బ్ర
హ్మదేవుడుచెప్పెను నరేత్రోవలోనొకమల్లెచెట్టున్నది దానినిండాపూవు
లున్నవి ఎవ్వరును నొక్కపువ్వయినను కోసుకొనరు ఏమికారణమని
యాబ్రాహ్మణియడుగగా అదిపూర్వముభోగముదిఆజన్మమందుమల్లెపూ
వులు తెచ్చుకొని ఒక్కపువ్వయినను ఎవరికి ఇయ్యకుండా తానే అలంక

...నది అందుచేత యీలాపుట్టింది ఇప్పుడు నీవు వెళ్ళేటప్పుడు ఒకపువ్వు
కోసుకొనుము తరువాత అందరు కోసుకుంటారు అని బ్రహ్మ చెప్పెను న
రేశ్వరి వనలో దండెమున కోకలు కాలిపోవుచున్నవి ఎందుచేతనని యామె
యడుగగా యేమనరములు అతపముచను తీసుకువచ్చి ఒక బట్టయెప్పుడును
పెట్టినపాపసబోలేదు అందుచేత వారిచీరలు తెగుబడిపోవుచున్నవి నీవువె
ళ్ళేటప్పుడు అందులోనొక కోక తీసి కట్టుకొనుము చల్లారిపోవును అనిబ్ర
హ్మదేవుడు చెప్పెను నరేశ్వరి కవోల అట్లపెనములు మండిపోవుచున్న
వి ఎందుచేతనని యాబ్రహ్మనడుగగా అక్కడ ఎవరువాయనా
లు అందునున్నా అందుచేత మండుచున్నవి నీవువెళ్ళేటప్పుడు నీళ్ళు
చల్లి వెళ్ళుము అనిబ్రహ్మదేవుడు చెప్పెను నరేశ్వరి యిన్నియు చేయుదును నాకు
ఫలితమేమిటి అని యామె యడుగగా ముప్పైటరువదివత్తులు వేసి నిద్దెడు
నూనెపోసి దీపాలు వెలిగించినావు వెలిగించినందుకావత్తులు ఫలముమా
నివేసి ఒలికిన ఫలమిచ్చినాను వెళ్ళి నోముపట్టి ఉద్యాపనము చేసుకొమ్మని
బ్రహ్మ చెప్పెను అప్పుడామె నరే మంచిదని తిరిగివచ్చుచు అట్లపెనములపై
నీళ్ళుచల్లెను మరికొంతదూరము వెళ్ళి దండెమునకోకలు తగులబడిపోవుచుం
డగా ఒకటి తీసుకొని కట్టుకొనెను మరికొంతదూరము వెళ్ళి మల్లెపందిర్ని
రెండుపువ్వులు కోసుకొని కొప్పులో పెట్టుకొనెను మరికొంతదూరము వెళ్ళి
ఆవునకు దూడకు గడ్డివేసి నీళ్ళుపోసెను ఇంకను కొంతదూరము వెళ్ళి
ముంతమామిడిచెట్టున ఒకపండు కోసుకొని తినెను తరువాత బ్రాహ్మణుని
యొద్దకు వెళ్ళి పాలలో బియ్యముపోసి పరమాన్నము వండి అదివళ్ళెములో
పోసి రామ రామ రామ అని మూడుమాటలని యాతనికి పెట్టి తిన్నగా
యింటికి వెళ్ళెను తరువాత శివరాత్రినాడు మునికార్తీక దీపములనోము
పట్టి మూడువందల అరువదివత్తులు నిద్దెడునూనెపోసి శివాలయములో దీప

ము వెలిగించి యింటికివచ్చెను వత్తి ఫలముకంటె వలికిన ఫలము ఎక్కువ యగుటచేత ఆమె యింటికివచ్చేవరికి సిరిసంపద కలిగియుండెను అప్పుడు చిన్నలయినవారు కాళ్ళును, పెద్దలయినవారు చేతులును పట్టుకొని ఏమి నోముపట్టినావని యడిగిరి ఏమీలేదు మునికార్తీక దీపములనోముపట్టి నాను వలికిన ఫలమేమిగాని వత్తి ఫలము లేదని బ్రహ్మదేవుడు వరమిచ్చి వాడు అనియాబ్రాహ్మణునిభార్య వారందరితోను చెప్పెను. ఆనోము కలియుగములో అందరుపట్టి ఉద్యాపనముచేసుకొని శిరిసంపదలతో తుల తూగిరి.

దీనికిఉద్యాపనము — అయిదుమూళ్ళ అంగవస్త్రములో అయిదు మూనికెలబియ్యము మండపముపోసి దక్షిణ తాంబూలముపెట్టి వెండి ప్రమిదిలోవయిడువత్తి వేసి దీపము వెలిగించి బ్రాహ్మణునకు వాయనమీ యవలెను. శక్తి తప్పినను భక్తి తప్పరాదు కథలోపమయినను వ్రతలోపం కాకూడదు.

## 15 మాఘగౌరి కథ

ఒకబ్రాహ్మణునకొక కుమార్తెకలదు ఆకూతురుకి చిన్నతనము లోనే వెధవరికము వచ్చెను ఆపిల్లయవస్థచూడలేక తలిదండ్రులు అడవి లోనికి తీసుకొనివెళ్ళిరి పోగుచుండగా ఒకనదిగట్టుమీదనక్కకూర్చుండి పుని స్త్రీలంతా ఒక రేవునను విధవలంతా ఒక రేవునను అయిదేసిపద్మాలు పె ట్టకొని నోము నోచుకొనుచుండిరి అదిచూచి ఆతలిదండ్రులు పిల్లనుతీసు కొనివెళ్ళి అదేమినోముఅమ్మా అని వారిని అడిగిరి అప్పుడుపార్వతీదేవి కూడా ఆముత్తయిదువలలో ఒకముత్తయిదువగానుండి వాళ్లనుచూచి వారిమాటవిని అయ్యా ఆనోము నేను చెప్పెదనుగాని మీపిల్లనీనదిలో స్నానముచేయించుకునిరాగాని తీసుకొనిరండని చెప్పెను ఇంతకంటేనా అమ్మా అని వారాపిల్లను దీసుకొనివెళ్ళిరి అప్పుడుపార్వతీదేవిపిల్లనుచూ చి నీళ్ళలోనున్నయిసుక దోసెడుతీసి గట్టునపోయుమన్నదట ఆపిల్లఅప్రకా

రము పోయునరికి అదంతయు పసుపుఅయినదట మళ్ళీదోసెడుపోయు మమ్మా అన్నదట ఆప్రకారముపోయగాఅదికుంకుమ అయెను మళ్ళీపోయు మనగా ఆచిన్నది మళ్ళీదోసెడుపోయునరికి అది కొబ్బరి అయినదట మళ్ళీదోసెడుపోయుమమ్మా అనిచెప్పగాఅదిబెల్లముఆయెను మళ్ళీదోసెడు పోయుమమ్మా అనగా ఆమె ఆప్రకారము పోయునరికి అదిజీలకర్రఆయెను అవిచూపించి పట్టినయేడు పసుపు మరునటియేడు కుంకుమ మూడవ యేడు కొబ్బరి నాల్గవయేడు బెల్లము అయిదవయేడు జీలకర్ర సేరుం బావు సేరుంబావు చొప్పున ముత్తయిదువకు తలంటి నీళ్ళుపోసి భోజనము పెట్టి వాయనమియ్యమని చెప్పెను ఈనోము మాఘమాసములలో అమావాస్యవెళ్ళిన పాడ్యమి మొదలు నెలాళ్ళు మళ్ళీపాడ్యమివరకునీలాట రేవున పసుపు గౌరమ్మను పెట్టుకొని పసుపుతోడ అయిదుపద్మాలు పిండి తోడ అయిదుపద్మాలు కుంకుమతోడ అయిదుపద్మాలు పెట్టుకొనిపూజ చేసుకొని యిలాఅయిదేండ్లు పూజచేసుకొనిగౌరమ్మనునీళ్లలో విడిచివేసి నవాళ్లకు నిత్యసౌభాగ్యమువచ్చునని చెప్పెను ఆప్రకారము ఆపిల్లలచేత తలిదండ్రులు నోముపట్టించగా చచ్చినమగడు మళ్ళీవచ్చెను ఆమెపట్టిన నోమంతాపట్టిరి శక్తి తప్పినా భక్తి తప్పరాదు అక్షతలుతప్పినాలక్షవేలేండ్లు అయిదవతనము ఉద్యాపనము కథలోవున్నది.

పోలాలఅమావాస్య, చిట్టిబొట్లు, పసుపుగౌరి, ఉప్పుగౌరి, చిత్రిగుప్తులనోము, మునికార్తీకవ్రతము, మాఘగౌరి.



# నోములు కథలు నెంశేరు.

## గొడిసెనోము.

గొడిసెనోము పట్టిన గొంతిపట్టణములో వెదకి చూచినను విధవలేదు.

ఉద్యాపనము—ఏడాదికథచెప్పి అక్షతలువేసుకొని ఏడాదిదిం తపండు తినకుండ నియమముజరపి సంవత్సరముపూర్తియయిన పిమ్మట పదముగ్గురు ముత్తయిదువలకు పదమూడురవికలగుడ్డలు దక్షిణతాంబూల ము కేదమూను మానికలబియ్యము పులిహోరచేసి పదమూడుమూకుళ్ళ లోపెట్టి వాయనము నియ్యవలయును. కథలోపమయినను వ్రతలోప ముకాకూడదు. భక్తి తప్పినను ఫలముతప్పదు.

## వావిలలక్ష్మీవారముకథ.

ఒకబ్రాహ్మణునకు నలుగురు కుమారులును, నలుగురు కుమార్తె లును కలరు అతడు కుమార్తెలకు పెండ్లిపేరంటములుగావించి యత్తవా రింటికి వంపివేసెను. కడసారపుకూతురు మిక్కిలిదరిద్రముకలవారి కోడ లౌటచేత ఆమెను సోదరులును పుట్టినింటికితీసుకొనిరారైరి. ఆమెదరిద్ర బాధచేతను తన్ను అన్నలు ఒకసారియయిన పుట్టింటికి తీసుకువెళ్లకపో వుటచేతను మిక్కిలిదుఃఖించుచుండెను. ఇట్లుండగానామె పుట్టింట కడ సారపుతమ్మునకు పెండ్లితలపెట్టిరి. ఆవివాహమునకు యీకడసారపు చి న్నదానినితప్ప తక్కినవారిని తీసుకొనివచ్చి వారు పెండ్లిచేసుకొనిరి. అపెండ్లిలో తమ్మునిపిలువకపోయినను యీచిన్నదానికొడుకులు తాత గారింటికివచ్చి తాతా పందిరివేయమా చాపలు పరచమా అనియడు గగా నతడుతిట్టుచు మీరేమిచేయవద్దుపొమ్మని కసరి కొట్టెను. ఆబ్రాహ్మణునిపెద్దకోడలు మాత్రము కడసారపుఆడబిడ్డ రాకుండుటకు

విచారించుచు ఆమె దరిద్రదేవతను తిట్టుచు వంటబ్రాహ్మణులు బియ్య
ముకడుగుచుండగా నేను చాలాకాలముక్రిందట వావిలగౌరీదేవి నోము
పట్టినాను ఆ వ్యాపనమట్టేయున్నది. అని చెప్పి కడిగినబియ్యములోనుండి
అడ్డెడుతవ్వెడుతీసి యొకచేటలోపోసి కడుగనిబియ్యమొక యడ్డెడుతవ్వె
డుకూడ పోసి వయినొకపాతచేట మూతపెట్టి వావిలకొమ్మ పెట్టి
యందురవికలగుడ్డ దక్షిణతాంబూలమునుంచియాచిన్నయామెబిడ్డయిల్లు
గమయింటివ్రక్కనే యుండుటచేత వానిని గోడమీదనుండి ఆమెకు అం
దిచ్చెను. అవిపుచ్చుకొనియామెయింటిలో పెట్టునరికి సిరిసంపదవచ్చెను.
అటుతరువాత యాచిన్నదానిపుట్టింట అన్నగారికుమార్తెకు వివాహము
కాగా ఆమె పెండ్లికిరావలసినదని వచ్చిపిలచిరి, ఆమెయు పెండ్లినాడుఉద
యమున వచ్చెదనని చెప్పెను. ఆయుదయమున నవారీమీద ఆమెనుత
నయింటికి తీసుకొనివచ్చి పీటవేసికూర్చుండబెట్టి పంచభక్ష్యపరమాన్న
ములును ఆమెకువడ్డించిరి అప్పుడామె తనయొడలివస్తువులను దీసి పీట
మీదనుంచి పుస్తెలార ఆరగించుడు పూసలారా ఆరగించుడు అనిచెప్పి
పల్లకియెక్కి తనయింటికి వెళ్ళిపోయెను అప్పుడువారివారందరు ఏనమ్మా
తిరిగియింటికి వెళ్ళుచున్నావనియడుగగా నాపుట్టింటివారు నన్నుచూచిపిలి
చినారా లేదు నాపాలిటిమహాలక్ష్మిని చూచిపిలిచినారు. అనిచెప్పెను
వారందరు నీభాగ్యమేలాగునవచ్చినదని యడుగగా నేనేమినోమునుపట్ట
లేదు. నాపెద్దవదినగారు వావిలగౌరీదేవినోము పట్టియున్న నే యుద్యా
పనముచేసుకొని యావాయనమునాకిచ్చినది. నాకావాయనమందుకున్న
ఫలమేగాని మరేమియు లేదు. అని యామెచెప్పెను.

దీనికిఉద్యాపనము—కథచెప్పి ఏడాదిఅక్షతలువేసుకొని యేడా
దిఅయినతరువాత కొత్తచేటలో కడిగినబియ్యము అడ్డెడుతవ్వెడు కడిగి
నబియ్యము అడ్డెడుతవ్వెడుపోసి వావిలకొమ్మపెట్టి పాతచేటమూత

వేసి రవికలగుడ్డ దక్షిణతాంబూలములతో కూ
డను వాయనము అందియ్యవలయును కథలో
కూడను భక్తి తప్పినా ఫలము తప్పదు

## మూరేసిదశమి కథ.

ఒకరాజునకు ఒకబాలుడు కలడు ఆకుమారుడు చనిపోగా వానిని
తోడునకు పిల్ల నెవరయిన నిచ్చెదరాయని పట్టణమంతయు నడుగుచుండిరి
గిరి. ఎవ్వరును పిల్లనియ్యరైరి. ఆపట్టణమున నొకబ్రాహ్మణునకొక కూ
తురుకలదు. ఆచిన్నదానికి తల్లిపోవుటచేత సవతితల్లి గట్టించెను ఆమె
ధనాశచేత ఆపిల్లనిచ్చి పిల్లమెత్తు ధనము పుచ్చుకొనెను. రాజభటులా
చిన్నదానిని తీసుకొనిపోయి చచ్చిపోయిన రాజకుమారుని శవముతో కట్టి తీ
సుకొనిపోవుచుండగా నంతటవానవచ్చెను ఆ సమయములో నాకట్టును తీసు
కొనివెళ్ల లేక సమీపముననున్న యొకపాడు దేవాలయములో దింపి తమదా
రిని వారుపోయిరి. అంతటసూర్యుడస్తమించి యెల్లెడల చీకటి గ్రమ్మెను.
అంత వాచిన్నది కట్టువిప్పుకొని దేవాలయమునకు ప్రదక్షిణము చేయుచు
శివశివ! చిటికెనవ్రేలైన పట్టనీయవైతివి హరహర! అక్షతలుగింజయును
వేయనీయవైతివి. మహాదేవ మంగళసూత్రమైన కట్టనియ్యవైతివి. అని
అనుచు మూడుసార్లు ప్రదక్షిణము చేసెను. పార్వతీదేవి ప్రత్యక్షమై నీవె
వ్వరివని యడిగెను. నేను బ్రాహ్మణునికూతురను నన్ను చనిపోయినవా ని
తో కట్టిపడవేయగా నాయదృష్టముచేత నీయాలయమునకు వచ్చినాను
ఇప్పుడు నాయవస్థ గురించి చెప్పుకొనుచు ప్రదక్షిణము చేయుచున్నాన
ని యాబ్రాహ్మణస్త్రీ చెప్పెను. అప్పుడు పార్వతీదేవి నీవు క్రిందటి జన్మ
మున మూరేసిదశమి నోము పట్టి యుల్లంఘన చేయుట చేత నీకీగతి వచ్చినద
ని చెప్పి అక్షతలు నీళ్ళు యిచ్చి మూడు ప్రదక్షిణలు చేసి ఆనీళ్లు
వానిమీద చల్లుమని చెప్పెను. ఆచిన్నదాప్రకారము చేయగానే రాజ

కుమారుడు నిద్రపోయిలేచినవానివలె లేచికూర్చుండెను. తరువాత ఆ న్నిసంగతులు బ్రాహ్మణకుమార్తెవలన విని కాలక్షేపమునకైయామెను పుస్తకముచదువుమని తానర్థముచెప్పసాగెను. అంత తెల్లవారెను తిరుగి యప్పటియట్లు రాత్రిగాడివద్దవీనివిడిచిపెట్టిన వాండ్రందరువచ్చియిదేమి చిత్రమని ఆశ్చర్యముతోనడుగగా పార్వతీదేవియొక్క వరప్రభావమని యాచిన్నదవారితో చెప్పెను. అందుకువారందరు సంతోషించి యింటికి తీసుకొనివెళ్ళి వారిరువురకును మహావైభవముతో వివాహమును జరిగించిరి. అప్పుడా బ్రాహ్మణచిన్నది మారేడుదళమునోముపట్టి వెండిదళము బంగారుదళముచేయించి చెట్టుదళమొకటితెచ్చి ఆమూడుదళములుమూడుదోసిళ్ళబియ్యము శివునకు పూజచేసి చిరకాలసౌభాగ్య సంపదలతో సుఖమనుభవించెను, దీనికిదియేయుద్యాపనము. కథలోపమయినా వ్రతలోపముకాకూడదు. భక్తితప్పినా ఫలముతప్పదు.

## సంపద శుక్రవారమునోము.

ఒకబ్రాహ్మణునకు ఏడుగురుకుమాళ్ళుకలరు. వాండ్రిందరుదరిద్రముచేత బాధపడుచుండిరి. ఒకనాడుదయమున శుక్రవారమహాలక్ష్మి వచ్చి ముందుగావారిపెద్దకోడలి యింటికివెళ్ళెను. ఆమె ప్రొద్దున్నేలేచి పిల్లలకుఅన్నముపెట్టి తానుకూడా తినుచుండెను. అది సంపదశుక్రవార మహాలక్ష్మి చూచి ఛీవీరింటికేలవచ్చినానని గిరుక్కున తిరిగివెళ్ళి రెండవ కోడలియింటికివెళ్ళగా ఆమెప్రాచివాకట్లో పేడచేసుకొనుచుండెను ఛీఛీ దీనియింటి కేలవచ్చినానని తిరిగివెళ్ళి మహాలక్ష్మి మూడవకోడలియింటికి వెళ్ళగా ఆమెప్రాతగుడ్డలుకుట్టుచుకూర్చుండెను. ఛీ దీనియింటికేలవచ్చితినని మహాలక్ష్మి నాలుగవకోడలియింటికివెళ్ళగా ఆమె ప్రాచివాకటిలో గుంటలోవడ్లుపోసుకొనిదంపుచుండెను. అదిచూచి మహాలక్ష్మి ఛీదీనింటికేలవచ్చినానని అయిదవకోడలి యింటికివెళ్ళగా ఆమెప్రొద్దున్నేతల

చుట్టుకొనుచు కూర్చుండెను. ఆమహాలక్ష్మి ఛీ దీనింటికేల వచ్చినానని ఆరవకోడలియింటికి వెళ్ళగా ఆమె పాత్రదివా టిలోనలుగురు పిల్లలకుతలంటు కొనుతలంటుకొనుచుండెను. అదిచూచి మహాలక్ష్మి ఛీ దీనింటికేల వచ్చి నానని యేడవకోడలి యింటికివెళ్ళగా ఆమెతల్లగా అలుక్కొని తెల్లగా ముగ్గుపెట్టుకొనివసపురాచి బొట్టు పెట్టుకొని కట్టుకొన్నబట్టమగనికియిచ్చి తలుపువెనక కూర్చుండెను. ఆమహాలక్ష్మి యిక్కడయెంతచల్లగానున్నది అని ఆయింటివద్ద పడుకొనెను. లోపలినుండి ఎవరమ్మా యీలాగుండని ఏడవకోడలినిపిలువగా అమ్మా నామగడు సోమవారమునకు వెళ్ళినాడు మాకుకట్టుకొనుటకు ఒక్కటేబట్ట అందుచేతనాబట్ట ఆయనకిచ్చి నేను తలుపువెనుక కూర్చున్నానని చెప్పగా మహాలక్ష్మి అయితేయిలారావమ్మా కట్టుకొనుటకుబట్టనేనిచ్చెదనని చెప్పెను. ఇట్లు చెప్పి తనకట్టుబట్టలో సగముచింపియామెకిచ్చి అమ్మా నాకుసోలెడుబియ్యము పెట్టిఅన్నమువండి పెట్టుమని చెప్పెను అందుకాబ్రాహ్మణస్త్రీ అయ్యో యింట్లో బియ్యములేవు నాకెనిమిటిరానలేనని చెప్పగా అలాకాదమ్మా నీవుకోమటియింటికివెళ్ళి మాయింటికి శుక్రవారం మహాలక్ష్మివచ్చినదని చెప్పుము. వారిచ్చెదరని చెప్పెను ఆప్రకారము ఆమెకోమటి యింటికివెళ్ళిఅడుగగా వారు పప్పు ఉప్పు బెల్లముబియ్యము మొదలైనవియియ్యగా అవిపుచ్చుకొని తెలుకుని యింటికివెళ్ళి అదేప్రకారము చెప్పగా అతడునూనె తెలకపిండియిచ్చెను. అవిఆమెపుచ్చుకుని కంచరవానియింటికివెళ్ళి మాయింటికిశుక్రవారమహా లక్ష్మివచ్చినదని చెప్పుమన్నదని చెప్పగా గిన్నెలు బిందెలు మొదలైనవి యిచ్చెను. తరువాతఆమె సాలివానియింటికి వెళ్ళిఅదేప్రకారముచెప్పగా వాడుబట్టలనిచ్చెను ఆమెఅవియన్నియుపట్టుకొనియింటికివచ్చి నవకాయ పిండివంటలు నాలుగుకూరలువండి మహాలక్ష్మికిభోజనము పెట్టెను. ఆరోజునఆమెభర్త కందదుంపమూట పెట్టెరి అప్పుడాబ్రాహ్మణుడుఎడమూట పెడ మూటవేసుకొని మోయలేకుండనింటికివచ్చెను. ఇంటికిరాగానే భార్య

వానికిభోజనముపెట్టెను. భోజనముచేసి బ్రాహ్మణునికివియన్నియు సేలా
గువచ్చెననిభార్యనడిగెను ఆమెమనపాలిటి శుక్రవారపుమహాలక్ష్మి
వచ్చినది అని అందరినిఅడిగి పట్టుకొనివచ్చినానని చెప్పెను. అప్పుడుశుక్ర
వారపుమహాలక్ష్మి వెళ్ళెదనని చెప్పగా ఇప్పుడు కాదు రాత్రిదాకనుండిభోజ
నముచేసి వెళ్ళుదువు గానిఅని చెప్పి రాత్రిభోజనము పెట్టినతరువాత తిరుగ
వెళ్ళెదనని చెప్పెను, అందుకు బ్రాహ్మణునిభార్య ఇప్పుడు చీకటిపడినది.
రేపటిరోజున వెళ్ళవచ్చునని చెప్పెను ఆరాత్రియందరునుసుఖముగానిద్రిం
చిరి, కొంతరాత్రివేళ మహాలక్ష్మి లేచి అమ్మా కడుపునొప్పిగా నున్నది
అనిచెప్పగా చీకటిగానున్నది వీధిలోకివెళ్ళవద్దు అమూలకూర్చుండుమని
బ్రాహ్మణునిభార్యచెప్పెను. ఇట్లునాలుగుజాములు నాలుగుసారులు లేచి
మహాలక్ష్మినాలుగుమూలలుకూర్చునిమాయమైపోయెను. తెల్లవారగనే
బ్రాహ్మణుడును భార్యయునులేచిరి. బ్రాహ్మణునిభార్య చీపురు చేట
పుచ్చుకొనియిల్లుబాగుచేయుటకు తుడువపోగా నట్టింటఅన్నివోట్ల బంగా
రముకుప్పలుండెను. అందుకామెఆశ్చర్యపడి మహాసంతోషముతో ఆనం
గతిభర్తతో చెప్పి పాల నేతి కడిగి యీబంగారురాసులు పళ్ళెములో
పెట్టుకొనినాపాలిటిశుక్రవారపుమహాలక్ష్మివచ్చినదిగనుక యీభాగ్యము
కలిగెనని శుక్రవారపునోముపట్టుటకు మనస్సులో సంకల్పించుకొనెను
ఆగాగనుకొని వట్టింట నాలుగుమూలలుఅలికి ముగ్గుపెట్టి తలమువ్వాబొట్టు
పెట్టుకొనిపసపురాసుకొని పయిమీదనీళ్ళుపోసుకొని మహాలక్ష్మినిపెట్టి
నోమునోచుకొని కథచెప్పి అక్షతలువేసుకొనెను.

దీనికి ఉద్యాపనము:—అయిదేండ్లు ప్రతిశుక్రవారము ఒంటిపూట భోజనము చేసి అయిదుగురుముత్తయిదువులకు తలంటినీళ్ళుపోసి అయిదురవికలగుడ్డలిచ్చి పిండివంటలతో భోజనము పెట్టి దక్షిణతాంబూలములియ్యవలయును కథలోపమయినను వ్రతలోపముకాకూడదు భక్తితప్పినా ఫలముతప్పను.

## మార్గశిరలక్ష్మీవారముకథ

ఒకబ్రాహ్మణునకొకకూతురుకలదు ఆమెకునవతితల్లిపిల్లను ఎత్తుకొమ్మని చెప్పి కొంచెము బెల్లపుముక్క పెట్టుచుండెను. ఆచిన్నదినవతిపిల్లనుతీసుకొనివెళ్ళి మట్టితోబొమ్మనుచేసుకొని ఆబొమ్మకురవంత బెల్లపుముక్క నైవేద్యముపెట్టి అనుకొనుచుండేది అట్లుండగా కొన్నాళ్లకాపిల్లకుపెండ్లిచేసిరి ఆమెఅత్తవారింటికివెళ్లబోవునప్పుడు తానుచిన్నప్పటినుండి చేసుకొన్నబొమ్మలను నవారిలో పెట్టుకొనిమరీవెళ్ళెను. ఆమెతో మహాలక్ష్మీకూడావెళ్ళెను అంతనాపిల్లపుట్టింటివారికిదరిద్రమువచ్చెను. ఆమెఅత్తవారియింటివద్ద సిరిసంపదలతోదులదూగుచు పుట్టింటివారికిదరిద్రము వచ్చెనని తెలిసికొని తోబుట్టినవారికి కనికరించి ఒకకర్ర దొలిపించి ఆకర్ర నిండవరహాలుపోసి అన్నగారికిచ్చెను అదిపట్టుకొని అన్నగారువెళ్ళుచు త్రోవలోకడుపునొప్పివచ్చి ఆకర్రచెట్టునకుచేరవైచి కొంచెమూవలికి వెళ్ళెను అంతటనాత్రోవవెంబడిని కొందరువెళ్ళుచు ఆకర్రపట్టుకొని చక్కబోయిరి. అప్పుడాబ్రాహ్మణచిన్నవాడాకర్రవెదకి దొరుకునుగానక యింటికివెళ్ళిపోయెను. తరువాతకొన్నాళ్లకుతమ్ముడునివర్తమానము తెలియక మరలనాచిన్నదికబురంపగా నాతడువచ్చెను ఆమెని గాంచినాయనాస్థితి యేలాగున్నదనియడుగగా మునుపటివలెనేయున్నదని యాతడుచెప్పెను అప్పుడామెయొకచెప్పులజోడుకుట్టించి దానినిండవరహాలుపోసి అందులో [illegible] కొనివెళ్ళి నాన్నకీయమని తమ్మునికిచ్చెను.

అప్పుడా చెప్పులజోడుపుచ్చుకొని యొకచెరువు గట్టుదగ్గరకు వెళ్ళునరికి వానికిదాహమై యాజోడునక్కడ పెట్టిచెరువులోనికివెళ్ళెను అప్పుడొక కుక్కవచ్చి యాజోడెత్తుకొనిపోయెను. దాహముపుచ్చుకొని పైకివచ్చి యాతడుగట్టుపై పెట్టినజోడునుగానక ఇంటికివెళ్ళెను. కొన్నాళ్లకుతిరుగ వాని అక్కగారుకబురుపంపగానాతడాయూరికేగెను. ఏమినాయనాఏలాగున్నది మీస్థితియని వానినామెయడిగెను ఎప్పటిలాగేయున్నదని యాతడుచెప్పెను. అప్పుడామెయొక గుమ్మడికాయదొలిపించి దానినిండవరహాలుపోసి యదిపట్టుకొనివెళ్ళుమని యాతనికిచ్చెను. ఆకాయనాతడుపట్టుకొనివచ్చి చెరువుగట్టుమీదపెట్టి కాళ్ళుకడుగుకొనుచుండగా నాదారినిపోవుచున్న కోమటియొకడా కాయనుపట్టుకొనిపోయెను. ఒడ్డునకువచ్చి కాయగానక బ్రాహ్మణుడుతనయింటికిపోయెను. కోమటితనయింటివద్దకువెళ్ళి యాకాయనుకొట్టగా వరహాలునిండియుండెను. అప్పుడా బ్రాహ్మణచిన్నది తనపుట్టింటివారిసంగతి యెట్లున్నదో తెలిసికొందమని యచ్చటికి వచ్చెను. వారుమిక్కిలిదరిద్రులైయుండిరి అప్పుడామె తల్లినితీసుకొనివెళ్ళి మార్గశిరలక్ష్మివారమునోము నోపించిన యంతయన్నము కలుగునని తెలంచినదై యిల్లుతల్లినితీసుకొనివెళ్ళెను యింటికివెళ్ళినతరువాత అమ్మాయీరోజున మార్గశిరలక్ష్మివారము కాబట్టినోట్లోఏమీవేసుకొనవద్దని చెప్పెను ఆమెసరేఅని చెప్పి పిల్లలకు చద్దిఅన్నముపెట్టుచు నొకముద్దనోటిలోవేసుకొనియెను అప్పుడా బ్రాహ్మణచిన్నది తల్లితో అమ్మా స్నానముచేయుము నోచుకొందమనిచెప్పగా తల్లి అయ్యో పిల్లలకు అన్నముపెట్టుచు మరచిపోయియొకముద్దనోటవేసుకొన్నాననిచెప్పెను. అప్పుడాచిన్నది యింకనేవిధముచేతను వీండ్రకుభాగ్యముఅంటదనుకొని తానుమాత్రమునోచుకొన్నదట. అంతట రెండవవారమున తల్లినిబిలచి అమ్మా ఈవేళలక్ష్మివారము నోటయేమివేసుకొనకనిచెప్పెను. అందుకామెఅలాగేనని పిల్లలకు తలంటుచు అగిన్నెలోనూనిమిగులగా తలకురాచుకొన్నదట అంత

ములు నాలగవవారము చింతపండుకలిపి పరమాన్నమువండి పుష్యమా
సవువారము పూర్ణకుడుములువండి తల్లిచేత నోమునోపించెను.

ఉద్యాపనము—నాలుగువారములు నోమునోచుకొని కథచెప్పి
అక్షతలువేసుకొని మాత్రయిదువనుపెట్టుకొని నేతిపిండివంటవండుకొని
నోమునోచుకొనవలయును కథలోపమయినను వ్రతలోపముకాకూడదు
భక్తితప్పినను ఫలముతప్పదు.

### శోకములేని సోమవారముకథ.

ఒకబ్రాహ్మణునకు నలుగురుకొడుకులు నొకకుమార్తెయు కలదు
అతడాకుమార్తెకు వివాహముచేయగా ఆమెమగడు దేశాంతరము వెళ్ళెను
అందుకాచిన్నది మిక్కిలివిచారించుచుండెను అల్లుడువగా ఏడువగా ఆ
యుసురుతగిలి ఆబ్రాహ్మణునకు దరిద్రమువచ్చెను. అప్పుడాబ్రాహ్మణు
డొక చెఱువుత్రవ్వించినాడు కాని అందులోగంగపడలేదు, అందుకాబ్రా
హ్మణుడు మిక్కిలివిచారించుచు భార్యతోకూడి తపస్సుచేయగాపార్వ
తీపరమేశ్వరులు ప్రత్యక్షమై యెందుకుతపస్సుచేయుచున్నారనియడిగిరి
అప్పుడా బ్రాహ్మణుడు నాకొక్కకుమార్తె యున్నది అది అస్తమానము
ఏడ్చుచుండును. దానియుసురుతగిలి మాకు దరిద్రముసంప్రాప్తమయినది
అందుకొకచెరువుత్రవ్వించినాము అందులోనీళ్ళుపడినవికావు అందుచేత తప
స్సు చేయుచున్నామని చెప్పెను అప్పుడు పార్వతీపరమేశ్వరులు మీపె
ద్దకొడుకునుతీసుకొనివచ్చి యీచెరువునకడ్డమువేసినట్టయితే యిందులో
నీళ్ళుపడునని చెప్పిరి. బ్రాహ్మణుండందుకు వప్పుకొని పెద్దకొడుకును
తీసుకొనివచ్చి చెరువునకడ్డమువేయగా వెంటనే గంగపడెను. తరువాత
పార్వతీపరమేశ్వరులు [illegible] కల్పించి దర్శనమున శోకములేని సో[illegible]

తాంబూలములిచ్చి అయిదుమూనికలబియ్యముపూర్ణపువ్వుండలువండి వాయనమియ్యవలెను. కథలోపమయినను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలముతప్పదు.

వెలగలగౌరి.

వెలగ వెలగఅనరాదు. వేలుపెట్టిచూపరాదు. వెలగచెట్టుయొక్క నీడను వెళ్లరాదు వెలగపండుతినరాదు.

ఉద్యాపనము—పదమూడు జోడాలముచ్చికలతోనున్న వెలగకాయలు తెచ్చి దక్షిణ తాంబూలము నల్లపూసలు లక్కజోడు పెట్టి పదముగ్గురుముత్తయిదువులకు ఇవ్వవలెను కథలోపమయినను వ్రతలోపముకాకూడదు. భక్తితప్పినను ఫలముతప్పదు.

ముప్పదిమూడు పున్నములనోముకథ.

ఒకబ్రాహ్మణుడు తనకుమార్తెకు వివాహముచేయగా అల్లుడు మూడవనాడు చనిపోయెను. అప్పుడాపిల్లఆడుకొనుటకువెళ్ళి వచ్చుచుండెను ఒకరాజభార్య ముప్పదిమూడుపున్నములనోముపట్టి ముత్తయిదువ నిమిత్తము వీధిగుమ్మమువద్దనిలుచుండి యీబ్రాహ్మణుని కూతురు ఆ దారినివచ్చుచుండెను. చూచి నీవెవరిఅమ్మాయివిఅని యడిగెను. అది న్నది నేనుబ్రాహ్మణులపిల్లనుఅని చెప్పగా నేను ముప్పదిమూడుపున్నములనోముపట్టినాను వాయనమిచ్చెదను వచ్చెదవా యనియడిగెను. ఆ చిన్నది అలాగేవట్టకువెళ్ళెదనీయమనియడిగెను ముప్పదిమూడుఆకులు చెక్కలుముప్పదిమూడు డబ్బులుముప్పదిమూడు నల్లపూసకోళ్ళు ముప్పదిమూడులక్కజోళ్ళు ముప్పదిమూడుఅట్లు ముప్పదిమూడు కట్లజల్లిడలు ముప్పదిమూడు జోతులు చీర రవికలగుడ్డకొత్తజల్లెడలోపెట్టిపాతజల్లెడ మూసింది రాజభార్యఆచిన్నదానికివాయనమిచ్చెను. ఆచిన్నదిఆవాయన

ముందుకొనిపోవుచుండగా యింటికివట్టుకొనివచ్చెను. ఆతోటున్న
వెలుగుచూచి ఆపిల్లభర్త లేచికూర్చుండెను. అప్పుడందరు ఏమినోము
పట్టినావని యడిగిరి. ఏమినోముపట్టలేదు, రాజుగారిభార్య ముప్పది
మూడుపున్నములనోమునోచుకొని వాయనమిచ్చినది. పట్టుకువచ్చినానని
యాచిన్నదిచెప్పెను అప్పుడు చిన్నవానినిమిత్తమువచ్చినయమభటులుయ
మధర్మరాజునొద్దకుపోయి మహారాజా మీరుపంపుకొనిరమ్మని పంపిన
బ్రాహ్మణుచిన్నవానినిమిత్తము మేముపట్టుకొనిరాబోవుచుండగా
ఆరాణిభార్య ఎక్కడనుండో నోమునోచుకొని వాయనము తెచ్చుచున్నం
దున వానిప్రాణములుమాచేతనిలువక తిరిగి ప్రాణముపొందినవి.
మేమాతనిరమ్మనిబలవంతపెట్టినా వచ్చినాడు కాడని మానివేసుకొనిరి.
అప్పుడుయముడుగుఱ్ఱమెక్కి యాచిన్నవానిప్రాణములకయియుటకై వచ్చెను.
వచ్చియాబ్రాహ్మణచిన్నవానిప్రాణములుగొనికొనిపోవుచుండెను.
అంతనాచిన్నదివెంబడించెను కొంతదూరమువెళ్ళి ఏమిఅమ్మాయీ వ
చ్చుచున్నావనియడుగగా నాపెనిమిటిప్రాణములనిమిత్తము వచ్చుచు
న్నానని యామె చెప్పెను అంతనాతడు నీపెనిమిటిప్రాణములు కాక
మరియొకకోరియయినకోరుమనెను నేనుముప్పదిమూడుఅళ్లు వాయనము
తెచ్చుకున్నాను ఆఅళ్లకు ఎన్నిదోష్లలుండునో అన్నియేండ్లు అయిదవతన
మిమ్మని యామెకోరెను యముడును ఆలాగేయిచ్చినానని చెప్పి వెళ్ళు
చుండెను. ఆబ్రాహ్మణచిన్నదియు వానివెనుకనేవెళ్ళుచుండెను. తిరుగ
కొంతదూరమువెళ్ళి తిరిగిచూచి ఏమిఅమ్మాయీ యింకను వచ్చుచున్నా
వనియడుగగా యామెభర్తనిమిత్తము వచ్చుచున్నానని చెప్పెను,
అతనిప్రాణములుతప్ప మరేమియయిన నడుగుమని యముడు చెప్పగా
నాకేమిఅక్కరలేదు ముప్పదిమూడుపల్లపూసలకొప్పు తెచ్చుకొన్నాను
ఆకోళ్ళపూసలకెన్ని బెజ్జములున్నవో అన్నివేలయేండ్లు నాకయిదవతనము
నీయవలయునని యాచిన్నదియడిగెను. అప్పుడామెభక్తికి సంతసించి యు

ముడు అట్లే యిచ్చినాను పుచ్చుకొమ్మని యాతనిప్రాణములు విడిచి
చక్కాపోయెను. ఆచిన్నదియింటికివచ్చేసరికి పెనిమిటిలేచికూర్చుండెను.
అందరునిదియేమిమాహాత్మ్యమమ్మాయనియడిగిరి. ఏమీలేదు నేనుముప్పది
మూడు పున్నములనోముకాయనము తెచ్చుకున్నాను. ఆఫలమేయిది
ఇదివాయనము తెచ్చుకున్న ఫలమని యామెచెప్పెను వాయనమునకే
యింతఫలమున్నది నోము నోచుకున్న నెంతఫలమోయని అందరుముప్పది
మూడుపున్నములనోముపట్టి ముప్పదిమూడు పున్నములుసవాసముండి
క్రమముగా నుద్యాపనము చేసుకొనిరి. ఉద్యాపనము. ముప్పదిమూడు
అట్లు ముప్పదిమూడు అదులు ముప్పదిమూడు పోకలు ముప్పదిమూడు
డబ్బులు ముప్పదిమూడునల్లపూసలకోళ్ళు ముప్పదిమూడు లక్కజోళ్ళు
ముప్పదిమూడుజోతులు చీర రవికలగుడ్డ ముప్పదిమూడుకన్నుల కొత్త
జల్లెడలో పెట్టి వారిజల్లెడమూతవేసి ముత్తయిదునకు వాయనమియ్యవల
యును. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలము
తప్పదు.

## కుందేటి అమావాస్యనోముకథ.

ఒకకుందేలుచాకిబానలో పిల్లలనుపెట్టి మేతకొఱకు యెక్కడికో
పోయినది. చాకలిది వచ్చి పొయిమీద నాచాకిబాననుంచి మంట పెట్టు
చున్నది. అంతట మేతకొరకుపోయినకుందేలు తనపిల్లలనొద్దకువచ్చిచూచే
సరికి పొయిమీద బానలో పిల్లలు ఉడికిపోవుచూ ఉడికిపోవుచున్నామే
యమ్మాఅని యేడుచుచున్నవి తల్లియునా బానచుట్టుతిరుగుచు వుడకకండి
బిడ్డలారా ఉడకకుండా వుండ్రాళ్ళవాయనము నిచ్చినాను అనితల్లిచెప్పి
నది. పిమ్మట పిల్లలు చచ్చితిమే యమ్మాఅనియరచినవి, చావకండి బిడ్డ
లారా చావకుండా చలిమిడి వాయనమిచ్చితినని తల్లిపలికెను. అంతట
పిల్లలు చిమిడితిమే యమ్మాయని పిల్లలరచినవి. చిమడకండి బిడ్డలారా

చిమడకుండా చిమ్మిలివాయనమిచ్చినానని తల్లియనెను తనవాళపిల్లలు
వేగితిమేయమ్మాయని యరచినవి. వేగకంచిబిడ్డలారా వేగకుండా వేపుడు
య్యము వాయనమిచ్చినానని పలికెను పేలిపోతిమే యమ్మాయని
పిల్లలరచినవి పేలకంచిబిడ్డలారా పేలకుండా పేలాలువాయనమిచ్చినానని
తల్లిచెప్పెను అడుగంటితిమేఅమ్మా యని పిల్లలరచినవి అడుగంట
కంచిబిడ్డలారా అడుగంటకుండా అట్లువాయనమిచ్చినానని తల్లిపలికెను
కాలిపోతిమేయమ్మాయని పిల్లలరచినవి కాలకంచిబిడ్డలారా కాలకుండా
కర్రెలువాయనమిచ్చినానని తల్లిపలికెను పాకతిమేయమ్మాయని పిల్లల
రచినవి పాకకంచిబిడ్డలారా పరమాన్నము వాయనమిచ్చినానని తల్లిప
లికెను పొంగితిమేఅమ్మాఅని పిల్లలరచినవి. పొంగకంచిబిడ్డలారా
పొంగకుండాపేలాలువాయనమిచ్చినానని తల్లి చెప్పెను నానితిమేయమ్మా
యని పిల్లలరచినవి నానకంచిబిడ్డలారా నానకుండా నానబియ్యము
వాయనమిచ్చితిని యని తల్లిపలికెను మాడితిమేయమ్మాయని పిల్లలర
చినవి మాడకంచిబిడ్డలారా మాడకుండా మాడలువాయనమిచ్చినానని
తల్లిపలికెను కందితిమేయమ్మాయని పిల్లలరచినవి కందకంచిబిడ్డలారా
కందకుండా గారెలువాయనమిచ్చినానని తల్లిచెప్పెను ఇట్లుచెప్పుచు
తల్లి బానచుట్టుతిరుగుచున్నప్పుడు పిల్లలన్నియుపయికివచ్చితల్లిదగ్గరకు వెళ్ళి
పోయినవి యీయంతయుచూచుచున్నచాకలిది ఆశ్చర్యమునొంది కుం
దేలు నట్లుపిల్లలన్నియు బ్రతికివచ్చెననియడిగెను. అప్పుడాకుందేలు చా
కలివానితో నీవునాపిల్లలున్నబాన పొయిమీదపెట్టి ఉడికించుచున్నావు
నాపిల్లలన్నియు నరచుచున్నవి. అయేడుపు సహించలేక శోకముతో
బానచుట్టుతిరిగినాను అంతకన్న నేనేమియెరుగనని చెప్పెను. అప్పుడు
చాకలిదియీరోజునఅమావాస్య ఈరోజుమొదలుకొనికధచెప్పి అక్షతలు
వేసుకొని దీనికికుందేటిఅమావాస్యఅని పేరుపెట్టుకొని నోముపట్టెను
నోముపట్టి పైకధచెప్పుకొని అక్షతలువేసుకొనెను. ఈప్రకారము పద

మూడు అమావాస్యలు నోచుకొని అమావాస్యకొకరకము చొప్పున చలిమిడి మొదలయినవి చేసుకొని దక్షిణ తాంబూలము పెట్టి ముత్తయిదువలకు వాయనమిచ్చెను.

ఉద్యాపనము—మూడు మానికల బియ్యము చలిమిడిచేసి అది ఒకచేటలో పెట్టి చాకి బానకొని దానిలో పెట్టి చీర, రవికలగుడ్డ, పసుపుకుంకుమలు లక్క జోడు, దక్షిణ తాంబూలముతో ముత్తయిదువకు వాయనమియ్యవలెను.

కథలోపమయినను వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినను ఫలము తప్పదు.

## దంపతుల తాంబూలము నోము.

ఒకరాజు భార్య దంపతుల తాంబూలము నోముపట్టి ఉల్లంఘనచేసెను. అందువలన భార్యాభర్తల కెడబాటువచ్చెను సిరిసంపదకూడ లెక్కువయ్యెను ఇల్లుకొన్నా భర్త్సింపసహింపలేక యాచిన్నది అడవిలోనికి వెళ్ళి యచ్చటయేడ్చుచు కూర్చుండెను. పార్వతీపరమేశ్వరులు భూమి పాలించుటకు వచ్చి ఎందుకేడ్చుచున్నావనియడుగగా నాయనా మీకెందుకు చెప్పుమని చెప్పెను. అందుకు వారాలాగుకాదు చెప్పవలసినదని యడిగిరి. ఆమె నా పెనిమిటి దేశాంతరం వెళ్ళినాడు సిరిసంపదనగ్గిపోయినది అందుచేత విచారించుచున్నానని చెప్పెను అప్పుడు పార్వతీపరమేశ్వరులు నీవు క్రిందటిజన్మమున దంపతి తాంబూలముల నోము పట్టి ఉల్లంఘనచేసినావు. అందుచేతనీకీవిచారముకలిగినది. ఇప్పుడు కథచెప్పి అక్షతలువేసుకొని ఏడాది తాంబూలమిచ్చి యేడాదియైనతరువాత ఉద్యాపనచేసుకోవలసినదని చెప్పి యదృశ్యులైరి ఆమెఆప్రకారముజరుపగా భర్తవచ్చెను. సిరిసంపదలతో సుఖములనుభవించెను.

దీనికిఉద్యాపనము—దంపతులకు తలంటినీళ్ళుపోసి మున్నూటరువది కుడుములు మున్నూటరువది పోకలు తాంబూలసరంజాము ఒకపళ్ళె

మయినను పాండానుయయిననుకొని దానిలోవుంచి దంపతులకుభోజనము పెట్టి అండియ్యవలెను కథలోపమయినను వ్రితలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలముతప్పదు.

## గ్రామకుంకుమనోముకథ

ఒక బ్రాహ్మణునిభార్య గ్రామకుంకుమనోము పట్టి వీసెబియ్యము పసుపు వీసెబులకు కుంకుమ పండ్లు పట్టుకొని వెళ్ళి గ్రామములలోపంచి పెట్టుచుండెను. ఒకవీధి పంచిపెట్టేసరికి ఒక కొడుకువచ్చి అమ్మా మా నాన్నగారికి జబ్బుగానున్నది రమ్మనిపిలిచెను అందుకామె నాయనా ఒక్కవీధిఅయినదని చెప్పి రెండవవీధికివెళ్ళెను. అంతరెండవకుమారుడు వచ్చిమానాన్నగారికి చాలజబ్బుగానున్నది రమ్మనిచెప్పెను అప్పుడామె మూడవవీధికివెళ్ళి పంచిపెట్టసాగెను. అంతట మూడవకుమారుడువచ్చి అమ్మా మానాన్నగారిని క్రిందపడవేయుచున్నారని చెప్పి రమ్మనగా ఇంకరెండువీధులున్నవి వచ్చెదనని చెప్పి యామె నాలగవవీధికి వెళ్ళెను. నాలగవకుమారుడువచ్చి మానాన్నగారికి ప్రాణముపోయినదని చెప్పగా యికనొక్కవీధియున్నదని చెప్పి యామెఅయిదవవీధికివెళ్ళి పంచిపెట్టుకొని యింటికివచ్చేసరికి భర్త [illegible]గ్గునలేచి కూర్చుండెను అప్పుడు ఊరందరు ఆశ్చర్యముతో అమ్మా ఏమినోముపట్టినావు. ఏమివ్రతముపట్టినావని యడిగిరి. గ్రామకుంకుమనోముపట్టి అది అయిదువీధులనుపంచిపెట్టుకొని వచ్చేసరికి లేచికూర్చున్నారని చెప్పినది.

దీనికిఉద్యాపనము— వీసెబియ్యము కుంకుమ [illegible] పసుపు పండ్లు ఊరిలో పంచిపెట్టుకొనవలెను. కథలోపమయినను వ్రతలోపము కాకూడదు భక్తితప్పినను ఫలముతప్పదు.

గుడిసెనోము, వావిలలక్ష్మీవారము, మాఘమాసపుకోము, సంపద శుక్రవారము, మార్గశిరలక్ష్మీవారము, శోకములేనిసోమవారము. ప్రా ర్థాదివారము, వెలగలగౌరి, ముప్పదిమూడు పున్నములనోము. కుందేటి అమావాస్య, దంపతులతాంబూలము, గ్రామకుంకుమ.

# నోములకథలు నెం 4 రు.

## తరగనాదివారంకథ.

రాజుకూతురు ప్రధానికూతురు తరగని ఆదివారములు నోముపట్టిరి ప్రధానికూతురు యేడాదిన్ని ఆదివారమూ ఆదివారము తరగనికూర తిన కుండగను తరుగమనకుండగను ఉంచి భక్తి శ్రద్ధలతో నోచుకొని 13 కొబ్బరి కాయలు 13 కాసులు చీర రవిక పెట్టిలో బెట్టి ముత్తైదువునకు వాయన మిచ్చుచున్నది ఆమెకు గృహమునిండుగ నెక్కడ చూచినను సిరిసంపదలు తులతూగుచుండెను రాజుకూతురు సింగినాదము తరిగితే నేమివచ్చినది తింటే యేమివచ్చినది అని తరిగిన కూరలు తినుచు తరుగుచు భక్తి లేక శ్రద్ధ లేక నోము ఉల్లంఘనముచేసినది రాజుకూతురునకు పుట్టినబిడ్డలుచచ్చుచుండెవారు ఈమె ప్రధానికుమార్తైను దానియదృష్టమును చూచి సహింపలేక నొక నాడు ప్రధానికుమార్తెయొక్క బిడ్డలనందరిని తనయింటికిరప్పించి తల కాయలన్నియుకోసి పెట్టిలో బెట్టి ప్రధానికూతురింటికిపంపెను ఇక్కడ రాజుకూతురు పిల్లలనందరిని నరుకునరికిన అక్కడ ప్రధానికూతురింట్లో పార్వతీదేవి ఇక్కడొక అంతమంది పిల్లలను వేసిఉంచిపోయెను ఈపిల్లలకామె యన్నము పెట్టుకొనుచునుండగా రాజుకూతురుపంపిన పెట్టె యింటికి రాగా నా పెట్టె తీసిచూచుకునేసరికి దానిలో నాడుచు పాడుచు పదముగ్గురు పిల్ల లును బైటికివచ్చిరి వారినివీరినికూడా చూచుకొని ప్రధానికూతురుసంతో షించుచుండెను రాజుకూతురుదాసీదానినిచూచి ప్రధానికూతురేలాగున నున్నదని అడిగినదట అడిగితే అమ్మాయి పెట్టిలోనిపిల్లలను ఇంట్లోనిపిల్లలను చూచుకొని ఆమెపట్టరాని యానందముతో నున్నదని చెప్పినది అదివిని రాజుకూతురాశ్చర్యపడి యదివట్టిననోమే నేనున్నుపట్టినాను నాగతి యీలాగు కావడమేమని యడవులపాలై పోయెను అప్పుడు పార్వతీదేవి మునలి

ముత్తైయిదువుగా వచ్చి ఆమెకు కనబడి యేమమ్మా ఈలాగున వచ్చినావు అని
యడిగినది ప్రధానికూతురును నేనున్ను ఒకే నోము పట్టినాము అదియీ
లాగున సిరిసంపదలతో తులతూగుచుండగా నేనిలాగున నున్నాను అందుకు కారణ
గాను అడవులలోనికి వచ్చితినమ్మా అని రాజుకూతురు పార్వతీదేవితో
చెప్పెను అప్పుడు పార్వతీదేవి ప్రధానికూతురు తరగని ఆదివారముల నోము
భక్తిశ్రద్ధలతో తరగకుండాను తరగమనకుండాను తగినదలిన కుండాను
చేసికొన్నది నీవు ఉల్లంఘనము చేయుటనుబట్టి యీలాటి దశ వచ్చినది అని
చెప్పి తిరిగి యీమె నోము పట్టించి యథావిధిగా ఉద్యాపనము చేయింది
తానా వాయనమందుకొన్నది అప్పుడు రాజుకూతురు కడుపుచలువ సిరిసం
పదలు కలదై యుండెను ఆమె నోచిన నోము తానోచిరి. అక్షతలు తప్పినను
లక్షవేలయిదవతనము.

## 2 బచ్చలగౌరి కథ.

ఒక చిన్నది కాపురము చేయుచుండగా అన్నగారు చూచుటకు వచ్చె
ను ఆ చిన్నది అన్నగారితో కొంతసేపు ఇష్టాగోష్ఠియుండి పిమ్మట పిండివంట
లతో వంటచేసి కూరపోపునకు కరివేపాకు కావలసివచ్చి అన్నయ్యా దొడ్డిలో
చెట్టువున్నది కొంచెము కరివేపాకు తెచ్చిపెట్టుమని అడిగెను అలాగే అని
చెప్పి వెళ్ళి యెంతసేపటికీ రాలేదు పాముకరచి అక్కడ పడిపోయెను. ఇంకను
అన్నగారెంతసేపటికి రాలేదని ఆ చిన్నది దొడ్లోకి వెళ్ళేటప్పటికి చెట్టుక్రిందపడి
పోయిన అన్నగారు కనబడెను ఆమె తొట్రుపడుచు వెళ్ళి అన్నా అన్నా అని
పిలిచి పలుకకపోగా యేడువసాగెను ఆమె యేడ్పువిని ఊరిలోవారందరు వ
చ్చిరి అందులో ఒక ముసలి ముత్తైదువ ఆ చిన్నదానిని చూచి అమ్మాయీ
నీవిక్కడ లేచి లోపలికి వెళ్ళి పువ్వులతోడ కాయలతో పండ్లతో నున్న
బచ్చలిచెట్టు తెప్పించి పూజచేసి ముత్తైదువకు తలంటినీళ్ళుపోసి భోజ
నము పెట్టి వెండిబచ్చలికాయ బంగారపు బచ్చలికాయ చేయించి బంగారపు

దిసీవ్వుంచుకొని వెండిబచ్చలికాయ చీరెరవికలగుడ్డ బచ్చలిచెట్టుతాంబూలముదక్షిణతో ముత్తయిదువకువాయనమిచ్చిభోజనము పెట్టి రావమ్మా వచ్చినీఅన్నను లేవనమ్మా అన్నదట అమాటవిని చిన్నది చటాలునలేచి ఆముసలిఅవ్వ చెప్పినట్లుచేసి మళ్ళీవచ్చిఅన్నా అనిపిలిచేసరికి నిద్రనుండిలేచి నట్లాతడులేచిచూచెను అప్పుడామెసంతోషించెను ఇది బచ్చలిగౌరినోమమ్మా ఇదినోచినవారికికడుపుచలువ తోడునీడచలువపుట్టించి చలువఅయిదవతనముకలుగునుఅనిముసలిముత్తయిదువ చెప్పి నేనుపార్వతీదేవినని చెప్పి అంతర్ధానమయినదట ఆమెపట్టిననోము జగమందరుపట్టిరి ఏడాదిబచ్చలి తినకూడదు శక్తితప్పినాభక్తితప్పకూడదు. అక్షతలుతప్పినాలక్షవేలయేండ్లు అయిదవతనము (ఉద్యాపనము కథలోచెప్పబడినది)

## ధైర్యలక్ష్మికథ.

ఒకబ్రాహ్మణునకు అరుగురు కొడుకులును ఒకకూతురును కలరు ఆకూతురత్తింట కాపురముచేయుచుండెను ఆసమయములో మొదటిఅన్నకు పెండ్లికార్యముతలపెట్టి రావలసినదని కూతురినితల్లిదండ్రులుపిలిచిరి ఆమెసరేఅని తీరా పెండ్లిప్రయాణమైరాబోవుచుండగా ఆమెభర్తకు ప్రాణముమీదికివచ్చెను అందుచేతనామె ఆప్రయాణమును మానివేసెను. ఆలాఅయిదురోజులుఉన్నతరువాత పెండ్లిఅయినతరువాత ఆమెభర్తజబ్బుకుదిరిలేచెను ఈలాగేఅందరిఅన్నలపెండ్లిండ్లకు ఆమెప్రయాణము అయ్యేనటికి ఆయనకు ప్రాణముమీదికివచ్చి క్రిందపెట్టుచుండేవారు ఆ పెండ్లిరోజులుఅయినతరువాత ఆయనకు నెమ్మదిగానుండేది చివరకు కడసారపుఅన్నకుపెండ్లిరాగా ఆమెప్రయాణముఅయ్యేసరికి మామూలుప్రకారము ప్రాణముమీదికివచ్చెను ఆలాజబ్బు చేసినప్పటికి ఈసారి ఆమెధైర్యము తెచ్చుకొని ఇదియేదోచిత్రముగానున్నదిఇదిచూతము నాధైర్యలక్ష్మియే నన్ను కాపాడగలదని ఆమెయెంచుకొని మొవ్వరితోడనుచెప్పకక్రింద

పారవేసినపురుషుని చాపలోచుట్టిమూలపెట్టి తలుపు తాళములు వేసితిన్న
గా బయలుదేరిపుట్టింటికివచ్చుచుండెను అంతదారిలోనొకజువ్విచెట్టు కన
పడెను ఆమెయాచెట్టువద్దకువెళ్ళి నీవేనాపాలిటిధైర్యలక్ష్మివితల్లీ నేనుతిరిగి
యింటికివచ్చేటప్పటికి నామగనికినింపాదిగానుండిననీకు యేడాది పూజ
చేస్తానని దణ్ణము పెట్టి తిన్నగాపుట్టింటికివెళ్ళి అన్నపెండ్లిఅయినతరువాత
యింటికితిరిగివచ్చెను వచ్చేసరికి ఎప్పటిజువ్వికిపూజచేసిమరివచ్చెను తలు
పుతీసిచూచేసరికి మగడులేచివుండెను మిక్కిలిఆరోగ్యము కలవానివలెనే
జబ్బుయేమిలేక కులాసాగానుండెను నాడు మొదలుఏడాది జువ్వికిపూజ
చేసుకున్నదట అంతటఆమెకు సిరిసంపద తరగనిఅయిదవతనమువచ్చెను.
అంతటఇరుగుపొరుగుఅమ్మలువచ్చి ఏమమ్మాచచ్చినపురుషుని యింట్లో
పెట్టిచక్కాపోయి వచ్చేటప్పటికి పురుషుడు లేచి తిరుగుచున్నాడు ఏమి
నోమునోచినావు ఏమివ్రతము పట్టినావు అనిఅడిగినారట అడిగితే ధైర్య
లక్ష్మినోముపట్టి జువ్విచెట్టుకు పూజచేసినానమ్మా అన్నదట ఆమెపట్టిన
నోము లోకమంతాపట్టిరి శక్తితప్పినా భక్తితప్పరాదు అక్షింతలుతప్పినా
లక్షవేలయేండ్లు అయిదవతనము (ఉద్యాపనము కథలోచెప్పబడినది,)

### శాకదానము కథ.

రాజుభార్యయుమంత్రిభార్యయుశాకదానమునోముపట్టిరి రాజుభార్య
అన్నిఒక్కమారేయిచ్చెదనని ఊరుకొన్నదట మంత్రిభార్య తోటకూర
మడివేసిరోజూఒకబ్రాహ్మణునకు ఒకదబ్బుడుకట్టతోటకూరయిచ్చుచుం
డెను ఈప్రకారముయేడాదియిచ్చెను ఇట్లు ఇచ్చుటవల్ల కష్టశోకము
లేకుండసిరిసంపదలతో మంత్రిభార్య సుఖముగానుండెను రాజుభార్యకు
ఎప్పుడో చేయుదుననియూరకున్నందువలన శోకముఎక్కువయినదట ఆశో
కముభరింపలేక అడవిలోనికిపోయిఒకచోటఏడ్చుచుకూర్చుండియుండగా

పార్వతీ పరమేశ్వరులు భూమిపాలించు నిమిత్తమైవచ్చిరమ్మా యీ లాగేడ్చెదవని యడిగిరి ఏమీ లేదు అస్తమానము నాకు యేడువవలెననిబుద్ధి అందుచేత యీలాయేడ్చుచున్నాను అని చెప్పెను. అందుకువారుఆలా కాదమ్మా నీవుశాకదానమునోముపట్టి తిన్నగా ఇచ్చినావుకావు అందుకు చేత నీకు శోకమువచ్చినది ఇప్పుడుమళ్ళీ ఇంటికివెళ్ళి యీ నోముపట్టి మరచిపోకుండా నిత్యము ఒకకూర బ్రాహ్మణునకు తప్పకుండా దానమిమ్మని చెప్పగా నాలాగు దానమిచ్చుచుండెను అదిలగాయతు ఆమెకు శోకముపోయిసిరిసంపదకలిగిసుఖముగానుండెను, అప్పుడంతా ఏమినోము పట్టినావు శోకముపోవుటకుఅని అడుగగా ఆమె శాకదానమునోము పట్టి నానని చెప్పెను అప్పుడంతా ఆనోముపట్టి ఉద్యాపనము చేసుకొనిరి.

ఉద్యాపనము—తోటకూరమడిచల్లి బ్రాహ్మణునికి తలంటిపోసి జామారుయిచ్చి పదమూడుడబ్బులదక్షిణయిచ్చి తోటకూర ఆబ్రాహ్మణునకు వాయనము ఇయ్యవలయును కథలోపమైనను వ్రతలోపము కాకూడదు భక్తితప్పినను ఫలముతప్పను.

రేగులగౌరి కథ

ఒకరాజుభార్య రేగులగౌరినోముపట్టిమరచిపోయెను ఆమెకుసంతానములేదు సంతానములేకపోయెగదా అని విచారముతో తలగట్టుకొని పరుండెను ఆసమయమందు విష్ణుమూర్తి వైష్ణవవేషముతోవచ్చి ఏమి అమ్మా ఈలాగుపరుండియున్నావు అనియడుగగా సంతానములేని చింత చేత ఈలాగుపరుండియున్నానని చెప్పెను నీవు రేగులగౌరినోముపట్టి మరచి పోయినావు. అందుచేతనీకు సంతానముకలుగలేదు ఇప్పుడైనా బంగారు రేగుపండ్లు తవ్వెడునరసోలడు చేయించి దక్షిణతాంబూలములతో ఒక

బ్రాహ్మణునకు వాయనమిచ్చినట్టయితే నీకు పిల్లలు పుట్టెదరని చెప్పి యాతనుచక్కా వెళ్ళెను అంతట ఆమె లేచి అదేప్రకారము బంగారు రేగి పండు తవ్వెడు నరసోలెడు యుంచి ఒక బ్రాహ్మణునకు వాయనమిచ్చెను. తరువాత ఆమెకు సంతానము కలిగెను. అప్పుడంతా వచ్చి నోముపట్టి నావద్దమ్మా నేను వ్రతము చేసినావద్దమ్మా నీకు సంతానము కలిగినదని యడిగిరి యేమీలేదు పోయిన్నప్పుడు రేగులగౌరినోముపట్టి మరచిపోయినాను అందుకు ఇప్పుడు విష్ణుమూర్తిలాగున బ్రాహ్మణుడువచ్చి అనంగతిచెప్పి రేగులగౌరినోము తిరిగిపట్టుమని చెప్పగా పట్టినాను అందుచేతనాకు బిడ్డలుకలిగినారని యీనోముభాగ్య అందరికినిచెప్పెను, అప్పుడంతా ఆనోముపట్టి యేడాది అక్షతలు వేసుకొని యేడాది అయినతరువాత ఉద్యాపనము చేసుకొనిరి

ఉద్యాపనము—కుంచెడుతవ్వెడు రేగుపండ్లు తెచ్చి అందులో ఒక బంగారపు రేగుపండు వేసి ఒక బ్రాహ్మణునకు తలంటినీళ్ళుపోసి పంచెలచాపు ఇచ్చి ఆకుంచెడు తవ్వెడు రేగిపండ్లు బంగారపు రేగుపండుతోపాటు బ్రాహ్మణునకు వాయనమియ్యవలెను కథలోపమయినను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలముతప్పదు.

### బాలాదివారముకథ

ఒకబ్రాహ్మణునకు ఒకకూతురు ఒకకొడుకు కొడుకు పెండ్లిఅయి కోడలు కాపురమునకు వచ్చెను. కూతురు చిన్నపిల్ల ప్రతిదినము వారింటికి యాయవారపు బ్రాహ్మణుడు వచ్చేవాడు ఈచిన్నపిల్ల ఆబ్రాహ్మణునకు రోజు యాయవారము వేసినప్పుడల్లా అతడు గంగస్నానఫలసిద్ధిరస్తు అనేవాడు కోడలు యాయవారము వేయగా సౌభాగ్యవతీభవ అనేవాడట ఆమాటలు విని కూతురు తల్లిదండ్రులతో కూడ రోజూ బ్రాహ్మణుడు నన్ను యీలాగున వదినను కోరలగున దీవించుచున్నాడేమనియడుగుచుండెను యేమిచేపింది

వాడమ్మా అని తలిదండ్రులు అడిగితే ఆపిల్ల ఈరెండుమాటలుచెప్పెను
అదివిని తలిదండ్రులుదుఃఖపడి మరునాడు యాయవారపుబ్రాహ్మణుడు
వచ్చినప్పుడు జాగ్రత్తగాకనిపెట్టియుండి ఏమయ్యా నీపిల్లనాలాగున దీ
వించెదవని యడిగిరి. ఆబ్రాహ్మణుడు వారినిజూచి ఆచిన్నదానికి బాల్య
ములోవైధవరికమున్నది గనుక గంగాస్నానఫలసిద్ధిరస్తు అనిదీవించుచు
న్నాననియు ఈచిన్నదానికి చాలాఅయిదవతనమున్నదిగనుక సౌభాగ్య
వతీభవ అనిదీవించుచున్నాననియుచెప్పెను. ఆమాటలువిని తలిదండ్రి
లుదుఃఖించి మాకొక్కకూతురునాయనా అనియేడ్చి ఆబ్రాహ్మణుని
కాళ్ళమీదపడి మాపాలి దేవుడవునీవేగనుక నీపిల్లకు అయిదవతనము
వచ్చేమార్గముచెప్పి రక్షించవలయునని ప్రార్థించిరి. అప్పుడాబ్రాహ్మ
ణుడు బ్రహ్మవ్రాత యెవ్వరు తీసివేసేవారులేరు అయిననూనేనొకమాట
చెప్పెదను అలాచేయుడనెను ఇంతకంటేనేమినాయనా చెప్పుమని వా
రడుగగా ఈపిల్లకుపెండ్లిఅయినతరువాత కొన్నిరోజులకే భర్తపోతాడు
పోగానే పోయినభర్తనింటిలోబెట్టి ఈపిల్లనుతీసుకొని మీరుగంగానదికి
స్నానానికివెళ్లండి అలావెళ్ళినయడల దారిలోనొకముత్తయిదువ స్నానా
నికివెళ్ళుతూ చెంగున కట్టుకున్న పసుపుపొట్లము కుంకుమ పొట్లము
పడిపోతవి అవినింపాదిగమీపిల్లచేతతీయించి ఆముత్తయిదువతో కూడా
వెనుకనే స్నానాలరేవునకువెళ్ళండి అక్కడకువెళ్ళినతరువాత ఆమెస్నా
నముచేయబోయేసమయమున చెంగునున్నమూటలు లేకపోగా అమ్మో
నాపసుపుకుంకుమ యెవరికో దొరికింది అనుకుంటుంది ఆమాటవిన్నతో
డనే నాకుదొరికినదమ్మాయని మీపిల్లను పసుపుకుంకుమ యిమ్మనండి
ఇయ్యగానే ఆముత్తయిదువ ఆపిల్లచేతిలోనింత మీచేతిలో పసుపు
కుంకుమపెట్టి తానురాచుకొని స్నానముచేయును. అప్పుడుమీపిల్లచేత
స్నానముచేయించి యింటికితీసుకొనివచ్చి సేసుంబావుపాలు పరమాన్న
మువండించి అడుగుమట్టు పైమట్టు తీసి మధ్యముత్తయిదువ కిప్పించి

ముత్తయిదువను పంక్తిని పెట్టుకొని భోజనము చేసిన తరువాత ...
చీరె రవికెలగుడ్డ తాంబూలము దక్షిణతో ఇయ్యాలి అనిచెప్పెను. అలాగు
చేసిన చచ్చినపురుషుడు మళ్ళీ బ్రతుకుతాడు ఈపిల్ల చిన్నతనంలోను
పసుపుకుంకుమ అన్నివస్తువులు దొంగతనము చేస్తుంటే మీరు తలితండ్రులై
యుండి చూస్తూ ఊరుకొనుట చేత యీ జన్మమున ఆదొంగతనము చేసిన
దోషమున యీపిల్లకు బాలవిధవరిక దోషమును చూచుచు ఊరుకొన్న కా
రణమున పిల్లనుచూచి దుఃఖించుట మీకును కలిగినవి అని చెప్పినాడట
ఆమాటలువిని బ్రాహ్మణునకు మొక్కి ఆయన చెప్పిన ప్రకారము పిల్లకు
పెండ్లి చేసిన తరువాత విధవరికము రాగా గంగస్నానమునకు తీసుకొని వెళ్ళి
యథావిధిగ జరిపించిరి ఆచిన్నదానికి అప్పుడు చచ్చినభర్త మరల బ్రతికి
వచ్చెను ఆమెపట్టిన నోము జగమంతా పట్టి అయిదవతనముతో సుఖపడిరి
శక్తి తప్పినా భక్తి తప్పరాదు అక్షతలు తప్పినా లక్షవేలయేండ్లు అయిదవ
తనము.

## సావిత్రిగౌరిదేవికథ అను

## (బొమ్మలనోముకథ)

అనగనగా పార్వతీదేవి మూడు పండుగులు వెళ్ళిన ముక్కనుమ
నాడు శివునితోటి యీభూలోకం మీద అష్ట ఐశ్వర్యంబులు పొందేట
టువంటి ఒకవ్రతము చెప్పుమని యడిగెను శివుడు చెప్పదొడగెను ఏమ
నగా మూడుదోస్లపేడ చేసి మూడుకదుళ్ళనూలు పోసుకుని పదిమంది పే
రంటాళ్ళను పోగుచేసి వ్రతము చెయ్యమని చెప్పెను పుట్టినరోజు పులగం
నైవేద్యము పెట్టి భూచక్రింపలేను రెండవరోజున చలిమిడి నైవేద్యం
పెట్టి చల్లనిచందురుడు తోడబుట్టింది మూడవరోజున ... నైవేద్యం
పెట్టి ముద్దునా గారానా పెరిగింది నాల్గవరోజున నానబియ్యం నైవేద్యం
పెట్టి నాగప్పసాని అయింది అయిదవనాడు పరమాన్నము నైవేద్య

మాపట్టి తేరని పుష్పరోరించి ఆరవరోజున గారెలు నైవేద్యము పెట్టి గారాబమ్మడు తోడబుట్టింది ఏడవనాడు అట్లు నైవేద్యము పెట్టి పట్టితల్లి అయింది ఎనిమిదవనాడు బూరెలు నైవేద్యము పెట్టి భూమంతా ఏలింది తొమ్మిదవనాడు పెరుగు పేరిన నెయ్యి నైవేద్యము పెట్టి పాతాళం ఏలింది కథలోపముయినా వ్రతలోపముకారాదు భక్తితప్పినా ఫలము తప్పదు మాటతప్పినా వ్రతముతప్పరాదు.

ఉద్యాపనము— తొమ్మిదిచాటలు చేట ఒక్కంటికి తొమ్మిదేసి పిళ్ళకుడుములు తొమ్మిది లక్కకోళ్ళు తొమ్మిది నల్లపూసలు కోళ్ళు తొమ్మిది అటలు తొమ్మిది చెక్కలు పెట్టి తొమ్మండుగురు ముత్తయిదువులకు యివ్వవలెను.

## మోచేటి పద్మము (మూగనోము.)

ఆశ్వయుజ బహుళ అమావాశ్యమొదలుకొని కార్తీకశుద్ధపూర్ణిమవరకును మూడుపూటల భోజనముచేసి సాయంకాల సమయమున కంఠస్నానము చేసి శుచియై తొలియేటతులసియొద్ద నాలుగుపద్మములు పెట్టుకొని నాలుగువత్తుల దీపము పెట్టుకొనిమాటాడకుండ నలుగురుముత్తయిదువలకు బొట్టుపెట్టి తరువాత నాలుగు నక్షత్రములను లెక్కపెట్టవలయును రెండోయేటయెనిమిదిపద్మములుపెట్టి యెనిమిదివత్తులు దీపం వెలిగించి యెనమండుగురు ముత్తయిదువులకుబొట్టుపెట్టి యెనిమిదినక్షత్రములు లెక్కపెట్టవలయును మూడవయేట పండ్రెండు పద్మములును పండ్రెండు వత్తులదీపమును పెట్టి పండ్రెండుగురు ముత్తయిదువలకు బొట్టుపెట్టి పండ్రెండు నక్షత్రములు లెక్కపెట్టవలయును.

దీనికి ఉద్యాపనము— తొలియేట నాలుగేసి అట్లు నలుగురు ముత్తయిదువలకు వాయనమిచ్చి దక్షిణతాంబూలము నల్లపూసలు లక్కకోడు ఇవ్వవలెను నోము నోచుకున్న వారలకు రెండుచేతులమీద రెండు అట్లున్ను రెండుడబ్బులున్ను రెండుకాళ్లమీద రెండుఅట్లున్న

రెండుదబ్బులున్న ఉండి అన్నగారు తలుపు వేయునుండి వినుడి చేరాలి
నపు రాకే పెడపరగండ అంటే తివ్వాదురానా మువ్వాన రాకా అనియుగ
వలయును అప్పుడు నోముపట్టినకన్య యివ్వ పేరమ్మ వలయును అన్నవచ్చి
పుస్తకముతో నాలుగుదెబ్బలుకొట్టి నాలుగు అట్లు నాలుగుదబ్బులు ఇయ్యకొన
వలయును ఈ ప్రకారము రెండవయేట ఎనిమిది వాయనములు మూడవయేట
పండ్రెండు వాయనములును ముత్తయిదువ కివ్వవలయును.

## ఈనోముపాట.

మోచేటిపద్మంబు పట్టేటివేళ మొగ్గల్లు తామర్లు పూసేటివేళ
కాకరపువ్వులు పూసేటివేళ కవలతో నుదకమ్ము తెచ్చేటివేళ అనపపువ్వు
లు పూసేటివేళ అటికెలతో నుదకమ్ము తెచ్చేటివేళ గుమ్మడిపువ్వులుపూ
సేటివేళ గుంజిగెలతో నుదకమ్ము తెచ్చేటివేళ పువ్వులుచాలపూసేటివేళ
బిందెలతో నుదకమ్ము తెచ్చేటివేళ నందెవేళ దీపమ్ము పెట్టేటివేళ వాకిలి
మడతలు తెచ్చేటివేళ ఆవులు గోవులు వచ్చేటివేళ అంబోతు రంకెలు
వేసేటివేళ అన్నలు బంతులాలా తెక్కేటివేళ తమ్ములు తాంబూలము
వేసేటివేళ బావలు పల్లకీలెక్కేటివేళ మరుదులు మంజాలమూసేటివేళ
కోడళ్ళుకొట్టుపసుపు కొట్టేటివేళ.

మద్దుమొగ మద్దానిబోలు తనముఖము తామరపద్మాన్నిబోలు
పద్మము పెట్టినచానకు తొమ్మిదివేలయేండ్లు అయిదవతనము మొగ్గపెట్టినచానకు
మూడువేలయేళ్ళు అయిదవతనము ఈపాట పాడుచు తులసెమ్మకు ప్రదక్షిణ
ము చేసి అక్షతలు వేసుకొనవలయును.

## పదారు కుడుముల తద్దికథ.

ఒక రాజకూతురు పూర్వజన్మమున పదారుకుడుముల తద్దినోము పట్టి
యద్దియుల్లంఘనము చేసినందున ఆమెకు దారిద్ర్యమును విధవత్వమును

భవించెను ఆదరిద్రబాధనామెయనుభవింపజాలక ప్రాణములు విడువ
నెంచి యొకనాడొకయడవిత్రోవనుబట్టి పోవుచుండెను. అప్పుడు భూపరి
పాలనకై పార్వతీ పరమేశ్వరు లాదారినివచ్చుచు నాయింతిఁజూచినీవెవ
రవు ఇట్లేలగొంటరిగా నీ ఘోరడవిలోభయములేక పోవుచున్నావనియడు
గగా నాజోలిమీకేల అనియామెప్రత్యుత్తరమిచ్చెను ఇట్లనుటకుపార్వతీ
పరమేశ్వరులు చిఁనవ్వు నవ్వుకొని ఎందుచేత నీవిట్లున్నదానివని యడు
గగా కుడుమునకూడు కట్టబట్టలేక దారిద్ర్యముచేత బాధపడలేక యీయడ
వులపట్టి పోవుచున్నానని యామెచెప్పెను అప్పుడు పార్వతీదేవి నీవు పది
యారుకుడుముల తద్దెనోముపట్టి యుల్లంఘనచేసినావు కనుక యిట్టి బీద
తనము నిన్ను బాధించుచున్నదని చెప్పెను అదివిని యారాజకుమార్తె
అమ్మా యాలోటు నేనెట్లుపూర్తిచేసుకోగలుగుదు దయచేసి చెప్పవల
యునని ప్రార్థించెను అందుకు పార్వతీదేవి యామెతో నీవిప్పుడు తిరుగ
నింటికిబోయి బాధ్రపద శుద్ధ తదియనాడు నోముపట్టి కథ చెప్పుకొని
యక్షతలువేసుకొని యానోము నుద్యాపనముచేసుకున్నయెడల నీదరిద్ర
బాధతీరునని చెప్పెను అదివినియాచిన్నదపార్వతీపరమేశ్వరులకు భక్తితో
నమస్కారముచేసి వారియొద్ద సెలవుతీసికొని యింటికిబోయి తలంటినీళ్ళు
పోసికొనిబిళ్ళకుడుములు వండుకొని చల్లతెచ్చుకొనుటకై పొరుగింట
కేగెను ఆసమయమున నొకకుక్కవచ్చి మోరగిలవేసిన తలుపుత్రోసు
కొని యాకుడుములనుతినిపోయెను అప్పుడా రాజకుమార్తెవచ్చి కుడు
ములుదినిపోవుచున్న యాకుక్కనుచూచి యదికుడుములుతినుటగ్రహించి
నిండుమనస్సుతో నాకుక్కకే తానుతెచ్చినచల్ల మూడుముంతలు
పోసెను అప్పుడాగౌరిదేవి యామెకు ప్రత్యక్షమయి ఓయుత్తమకాంతా
దీనికయి నీవువిచారింపవద్దు నీకైశ్వర్యము నిచ్చుచున్నదానను అనియంత
ర్ధానమునొందెను నాటనుండి యీరాచకూతురు సిరిసంపదలతో యేటేట
పదియారుబిళ్ళకుడుములు నైవేద్యముచేసి పదియారు బిళ్ళకుడుముల

వాయనమును దక్షిణ తాంబూలముతో నొకయిత్తి యిదువకువాయనమిచ్చి యుద్యాపనజేయుచు భూలోకమున నధికైశ్వర్యముల ననుభవించెను.

దీనికి ఉద్యాపనము — పది యేగుచేటలును చేటకొక్క ఇంటికివది రేసి బిళ్లకుడుములను [illegible] దబ్బలును దక్షిణయు పల్లపూవలు ఒక్క జోడుపెట్టి ఉద్యాపన చేసుకోవలయును కథలోపమయినను వ్రతలోపము కాకూడదు

బ్రాహ్మణమంగళవారము కథ.

ఒకబ్రాహ్మణుడు సంతానము లేక చింతిల్లుచు తపస్సు చేయదొడగెను ఆసమయమున పార్వతీపరమేశ్వరులు భూమిపాలించవచ్చి యాబ్రాహ్మణునిగాంచి ఓబ్రాహ్మణుడా ఎందువలన నీవితపస్సు చేయుచుంటివి అనియడిగిరి అందుకాతండు మీరేమిఆర్చేవారా తీర్చేవారా మీకెందుకు మీత్రోవను పొండని చెప్పెను వారును ఆర్చేవారము మేమే తీర్చేవారము మేమే కారణమేమియో చెప్పమనిరి సంతానహీనుడనయి యిట్లు తపస్సుచేయదొడగితిని నాకోరికదీర్చి నన్నురక్షింపవలయును అని దీనుడయి యాబ్రాహ్మణుడు వారలవేడుకొనెను వారుఆయువులేనిమగవాడు కావలెనా అయిదవతనములేని యాడుది కావలెనాయనియడిగిరి అప్పుడాబ్రాహ్మణుడింటికిబోయి నాభార్యనడిగి వచ్చెదనని చెప్పెను వారట్లనే కానిమ్మనిరి బ్రాహ్మణుడింటిలోకిబోయి భార్యనుచూచి ఆయువులేని మొగవాడు కావలయునా అయిదవతనములేని యాడుది కావలయునా అనియడిగెను పుట్టిచచ్చినాపుత్రుడేమేలు పుత్రునేయిమ్మని యాసాధ్వి యుత్తరమిచ్చెను. అంతనాబ్రాహ్మణుండతివేగముగ దాను తపస్సు చేయుచోటికిబోయి పుట్టిచచ్చినాపుత్రుడేమేలు కాబట్టి పుత్రునేకోరవలెనని నాభార్య వేడికొనెనని చెప్పెను అంతవారు ఊరివెలుపల నొకమామిడిచెట్టు

న్నకి దానికొకపండు కోసుకొనిపోయి నీభార్యకిమ్మని వారంతర్థానా
నొందిరి అప్పుడాబ్రాహ్మణుడొక ముంతమామిడి చెట్టుదగ్గరకు బోయి
చాలపండ్లుకోసుకొని వడిలోవేసుకొని యింటికివచ్చి చూసుకు నేసరికి వడి
లో నొకపండుమాత్రమేయుండెను అతడాపండుతినుమని భార్యకిచ్చెను
ఆపండునామెభక్షించి గర్భంబుదాల్చియంత తొమ్మిదినెలలు నిండిన
వెనుక నొకకొడుకును గనియెను ఆశిశువు పుట్టీపుట్టకపూర్వమే యమ
భటులువచ్చి వానినిమాకిమ్మని తల్లినడిగిరి ఆమెయు నాయనలారా
యీశిశువునకుపురుడుపోసినామా పుణ్యముపోసినామాయనిదీనవదనయై
పలికెను అంతనాయమభటులు వెళ్ళిపోయి పురుడు పుణ్యములైన తరు
వాత వచ్చి మొదటియట్ల పిల్లవానినీయమనియడిగిరి అందుకామె యీ
కన్నకొడుకు భారసాలచూచినామా ఆటపాటలు చూచినామా అనిపలి
కెను అంతటవారేగి తిరుగీ భారసాల అయినపిమ్మటవచ్చిరి వారినిగాంచి
పుట్టువెంట్రుకలు చూచినామా వడుగుచూచినామానాయనలారాఅని
బ్రతిమాలెను వారును ఎప్పటియట్లమరలిపోయిరి అంతగొన్నాళ్ళకాపిల్ల
వానికి దలిదండ్రులుపనైనమహోత్సవముగావించిరి తరువాత నొకనాడు
తల్లికొడుకునకు తలంటుచు నేడ్చెను ఆమె కంటినీళ్ళాపిల్లవానిపయి పడుట
చేత దెలిసికొని ఏమే అమ్మా ఇట్లుదుఃఖించుచున్నావని యడుగగా ఆమె
నాయనా నీవు పుట్టినదిమొదలుకొని యమభటులు నీకొరకు వచ్చు
చున్నారు నీకొడుగయినదాక జరుపుకొనివచ్చినాము ఇక నిట్లుజరపవచ్చు
నాయని యేడ్చుచున్నానని చెప్పెనుఅంతనాపిల్లవాడు ధైర్యమవలంబించి
అమ్మా నాకునచ్చిన భయములేదు మామామనుజతయిచ్చి నన్ను కాశీకి
పంపుమనిచెప్పెను అందుకామె సమ్మతించి మేనమామను కబురంపి
కొడుకున కాతని జతయిచ్చిపంపుచు నేమియు పలుక లేక కన్నులనీరు
బెట్టసాగెను అమ్మా యెందుకేడ్చెదవు నేను తులసిమొక్క నొకదానినిందు
వేసి వెళ్ళెదను దాని బాగోగులనుబట్టి నాస్థితిగతులు నీకు తెలియు

చుండును అని చని పోయిన యెడల నేనుయక్కట్టు యుగుమునని తెలుసుకొనుము
అని చెప్పిచాలివంలిధనముపుచ్చుకొని కాశీకి ప్రయాణమై పోవుచుండే వారికి,
తోవలోనొక పూలతోట కనబడగా ఆతోట వచ్చుటబసదిగిరి అంతవా
పట్టపు రాజుకుమార్తెయును పురోహితునికూతురును పెద్ద నదారుకూతు
రునుకలసి పూలుకోసుకొనుట కావనమునకు వచ్చిరి వారుపుష్పాలనుగోసు
కొని తిరిగి వచ్చుచు మాటపట్టింపులచే పోట్లాడి నీవు ముండవు అంటే నీవు
ముండవు అని తిట్టికొనిరి అప్పుడు రాచవారిపిల్ల కోపగించుకొని నాకీరాత్రి
పెండ్లి మాఅమ్మగారు శ్రావణ మంగళవారము నోమునోచుకొని నాకు
వాయనమిచ్చును నన్ను ముండా అని తిట్టకండి అని పువ్వులు పారపోసెను
చూచువారికి ఆశ్చర్యముగా నా పుష్ప లేకొమ్మని ఆకొమ్మకు అంటు
కొనెను ఆచిత్రము నారాజకుమారుడుచూచి యాశ్చర్యపడి ఆహా
యీచిన్నది యెంతసత్యవాదినియో యని పొగడికొని యీమెనాకు
భార్య అయినయెడల బాగుండునుగదా యని తనలోననుకొనెను అనంగ
తులను పక్కనున్న మేనమామగ్రహించి అబ్బాయీ మనము కాశీ వెళ్ళు
చున్నాము మనమట్టి తలంపులను తలపెట్టరాదు అనిపలికెను. ఇంతలో
ప్రొద్దుగుంకు సమయము కాగా నాపిల్లలు వారివారియిండ్లకేగిరి. రాజ
కుమార్తెను పెండ్లికుమార్తె జేసి ముహూర్తము సమీపించుచున్నం
దున పెండ్లికుమారుని రాకకయి రాజమొదలయిన వారెదురు చూచు
చుండిరి ఇంతలో పెండ్లికుమారునకు మూర్ఛవచ్చి పడిపోయినాడు
ఇప్పుడు పెండ్లికి రావీలులేదని యొకజాబు రాజుగారికందెను ముహూ
ర్తము సమీపించుచుండుటచేత ఆహా వేళమించిపోయెను ఎవరు పెండ్లి
కొడుకున కెవ్వరు దొరుకుదురాయని యాతడు పట్టణమందరిని అడిగెను.
ఎవరు పెండ్లికొడుకని కావ్యమును వప్పుకోరైరి నగమెరువుండు బట్టమొకు
వుండును గాని పెండ్లికొడుకు ఎవరేమిటి అనినవ్వసాగిరి అంతనారదూ
తంతయు తిరిగి రాజకుమారుడున్న తోటలోనికివచ్చి యక్కడయెవరో

మనుష్యులున్నారని వారివద్దకేగి వానిలేపెను వారు ఉలికిపడిలేచిరి రాజాపిల్లవాని మేనమామనుచూచి అయ్యా ఈపిల్లవానినొకసారిమొకు విచ్చెదరాయనియడిగెను అయ్యా మొకువేమిటి మేము తెల్లవారుజామున లేచి కాశీకి పోవుచున్నాము కావున వీలులేదని చెప్పెను రాజు గారు మహూర్తము దాటిపోవుచున్నది కామకూడదని బలవంతముచే మేన మామను ఒప్పించి యాపిల్లవానిని తనయింటికి దీసుకొనిపోయెను అట్లు తీసుకొనివెళ్ళి మంగళస్నానాదులు నాచరింపజేసి యాపిల్లదానితోగూడ పెండ్లిఅరుగుపైకి దీసికొనిపోయి సంతోషముతో వివాహకార్యమును జరిగించెను తరువాత నాపిల్లవానికి బంగారుగిన్నెలో ఫలహారము లుంచగా నాతడవి తినుచుండ వ్రేలి యుంగరముజారి యాగిన్నెలో పడి పోయెను ఆయుంగరము నాచిన్నది పదిలముగ దీసికొని తనవేలిని పెట్టు కొని యారాత్రినిద్రించు చుండగా కలలో పార్వతీదేవి యామెకు కని పించి నీపెనిమిటికినర్పగండమున్నది కాచుకొమ్మనియానతిచ్చెను అంమన కారాజుకుమార్తె అమ్మా ఏమిచేసిననది తప్పునో సెలవియ్యవలయునని ప్రార్థించెను నీతల్లి శ్రావణ మంగళవారమునోము పట్టినకుండను పాము రాగానేపట్టుము అందులోనది పడునని చెప్పెను ఆరాత్రిభర్తనిద్రించు చుండగా బుస్సుమని బుసకొట్టుచు పాము వచ్చుచుండెను అది కనిపెట్టి యాచిన్నది భయపడక పైనున్న కుండకయి చేయిచాచెను అది అందక పోయెను ఓహో కార్యముతప్పిపచ్చుచున్నదే యనిచెప్పి భర్తతొడపై కెక్కియాకుండ నందుకొని చప్పున పాముదిక్కునకు ఒగ్గెను ఆపాము వచ్చి యాకుండలో పడగా ఆచిన్నది రయికరవికగుడ్డచే నాకుండకు వాసిన కట్టి యొకచోట దాచిపెట్టి నిద్రపోయెను అంత తెల్లవారు జాముకాగా పిల్లవాని మేనమామవచ్చి యాతనిలేపుకొని తీసుకొని వెళ్ళెను అంత తెల్లవారెను మరల పెండ్లికి ప్రయత్నముచేసి పెండ్లి కొడుకునుదీసికొనిరాగా నాకతడుకాడు భర్తకాశీకివెళ్ళిన యాతడేకాని

యనియామెచెప్పెను దానికేమి ఆనవాలుఅని అందరు అడిగిరి అప్పుడా
చిన్నది తండ్రినిచూచి తండ్రీ నీవు ఏడాది అన్నదానము చేయుము నేను
తాంబూలదానముచేయుదునని చెప్పి అప్రకారముజరిగించుచుండెను అంత
ఏడాదిపూర్తి కాగా కాశికిపోయినఅల్లుడుమామలు కాశీనుండితిరిగివచ్చుచు
మునుపటి పూవులతోటలో నేదిగిరి అక్కడవారు పడుకొనబోతే వారిని
చూచినవారు అయ్యామీరూరకయేలపడుకొనెదరు ఈపట్టపురాజుగారు
అన్నదానముచేయుచున్నారు ఆయనకుమార్తె తాంబూలదానముచేయు
చున్నది మీరక్కడికిబోవుడని చెప్పిరి అప్రకారమువారు వెళ్ళి భోజనము
నర్చి తాంబూలనిముమిత్తమై యాచిన్నదియున్న చోటికిబోయిరి రాజకు
మారుని మేనమామకును వానికినిదాంబూలమిచ్చియిదిగోనాపతియనియా
చిన్నదివాని చేయిపట్టుకొనెను నీ పెనిమిటియగుటకేమియాధారమున్నదని
యందరునడిగిరి అప్పుడు భర్తనంకదిరిగి మీరు పెండ్లియాడిననాడుభోజన
మొనర్చువేళ బంగారపుగిన్నెలో మీవ్రేలియుంగరము జారిపడిపోయినది
అదియిదిగోయని మూతనివ్రేలినుంచెను అదినరిగ నరిపోయెను తరువాత
పెండ్లినాడు పార్వతీదేవివచ్చి నీభర్తకునర్పగండమున్నదని చెప్పెను దానికి
నేనేమిచేయుదనని యడిగినాను మీయమ్మ శ్రావణమంగళవారము నోము
నోచుకొన్నది ఆకుండనొగ్గవలసినదని చెప్పి యంతర్థానమొందగా నేనా
కుండను వగ్గుటకు పామువచ్చినపుడు ప్రయత్నించినాను అందినదికాదు
అప్పుడు నాపెనిమిటితొడలపైకాలువైచిఅందుకున్నాను అదిగోచూపించి
పసుపురాసినకాలుతొడమీదనున్నది అనిచూపించెను పరీక్షించి చూడగా
ఆ మూనవాలాతొడలపై కనిపించెను కుండపట్టుకొనివచ్చి విప్పిచూడగా
బంగారునర్పమైయుండెను అందునకందరును కామోదించిరి అప్పుడు అబ
ద్ధము ఇప్పుడు నిజముఅని ఆకాశమంతపందిరివేసి భూదేవంత అరుగువేసి
గుచ్చినముత్యాలతోరణాలుకట్టిగుచ్చనిముత్యాలుతలంబ్రాలుపోసిదెబ్బది
యోగములవారిరువురకు నారాజు పెండ్లిచేసెను అటుపిమ్మట నాచిన్నది

శ్రావణమంగళవారమునోముపట్టి అకాటుకవట్టుకొనిస్వారీతో అత్తవారిం టికివెళ్ళెను. ఇట్లువెళ్ళునరికత్తగారునుమామగారును కుమారునివియోగ దుఃఖముచేతకన్నులుకాళ్ళులేనివారైయుండిరి. ఈమ వారందరుపరుగుపరు గునవచ్చి సోమయాజులుగారు సోమిదేవమ్మగారు! మీకొడుకు, కోడలు వచ్చుచున్నారనిచెప్పిరి. అయ్యో మాకెక్కడి కోడలు, మాకెక్కడి కొడుకు, నాడేపోయినారు. అనివగచుచుండిరి అప్పుడు బాజాల చప్పుడు చెవులోప్రవేశించివారికిచెవులువచ్చెను. కోడలువచ్చిఅత్తమామలకు నమ స్కారముచేయగా వారికికాళ్ళువచ్చెను కౌగలించుకొనగానమనువచ్చి నది. కాటుకపెట్టగా కన్నులువచ్చెను ఏమినోముపట్టినావు ఏమి వ్రతము పట్టినావు? అనిఅందరుఅడిగిరి. నేను శ్రావణ మంగళవారము నోముపట్టి నానని వారికిజవాబు చెప్పెను అమెనోచిననోము కలియుగములోనందరు కూమెవలెనేసౌభాగ్యవతులైభూలోకమునప్రసిద్ధిగాంచిరి కథలోపమైనా వ్రతలోపముకారాదు భక్తితప్పినా ఫలముతప్పదు.

దీనికి ఉద్యాపనము—తొలియేట అయిదుగురు ముత్తయిదువలకు మలియేట పదిమంది ముత్తయిదువులకు మూడవయేట పదిహేనుమంది ముత్తయిదువలకు నాలుగవయేట యిరువదిమంది ముత్తయిదువలకుఅయి దవయేట ఇరువయిఅయిదు ముత్తయిదువలకు వాయనములు ఇచ్చుకొని అయిదేళ్ళు అయినతరువాత పెండ్లినాడు పెండ్లికూతురునకు మట్టెలు మంగళసూత్రములు క్రొత్తకుండలో ముప్పదిమూడుజోకుల అరిసెలుపెట్టి కొత్తరవికెలగుడ్డచే వాసెనకట్టి పెండ్లికూతునకు అందివ్వవలయును,



శ్రీరస్తు.

# నోములకథలు నెం 5 రు.

(పదహారు ఫలముల నోముకథ)

ఒక రాజుభార్యయు ప్రధానిభార్యయు పదునారు ఫలముల నోముపట్టి ప్రధానిభార్య మంచిఫలములనన్నిటిని యెంచి యుద్యాపన దక్షిణతో నొక ముత్తైదువకిచ్చినది. రాజుభార్య నేమగదా యెవ్వదానినని గెల్వించి పదు నారురకముల ఫలములు తెప్పించి కొట్టులో వేయించి మంచిసెబ్బరలు చూడకుండ దానము చేసినది. తరువాత ప్రధానిభార్యకు మంచిసంతానము కలిగెను. రాజుభార్యకు గ్రుడ్డివాండ్రు కుంటివాండ్రు పిల్లలు కలిగిరి. అప్పుడు రాజుభార్య ప్రధానిభార్యను జూచి యేమమ్మా మనమిద్దరముకూడా నోము పట్టినాము. ఉద్యాపన చేసినాము నీకు మంచిపిల్లలు పుట్టుట యేమి నాకట్టిసంతా నముకలుగక మేమియని యడిగెను అంతట ప్రధానిభార్య చిన్నగెర్వించి అన్ని ఫలములను నొక్కసారి దానంచేసినావు. నేను ఏ ఫలమునకాఫల మేర్చినాను. అందుచేత నీకట్టిసంతానముకలిగినది. నాకట్టిసంతానము కలిగినది అని చెప్పినది అప్పుడు రాజుభార్య యేమిచేయుమన్నావమ్మా యిప్పుడని ప్రధానిభార్యనడిగెను. తిరిగి పదునారుఫలములనోముపట్టి మం చిమంచి ఫలములనెంచి తగినదక్షిణతో నుద్యాపన చేసుకుంటే మంచి సంతానమగునని ప్రధానిభార్య చెప్పెను. అప్రకారము రాజుభార్యనోము పట్టి పదహారు ఫలాలు ఉద్యాపన చేసుకొనెను.

## సౌభాగ్యతదియలు.

ఒక బ్రాహ్మణున కొక ఆడుపిల్లకలదు. ఆమెకు చిన్ననాటనే విధ వరికము సంభవించెను. అందునుగూర్చి తలిదండ్రులు మిక్కిలి విచారించు

చుండెడివారు అజనసీజనకులు కొంతకాలమువరకుండి దుఃఖశాంతిగానక పిల్లతోకానకుబోయి విచారించుచుతిరుగుచుండగా భూమి పాలించుటకు పార్వతీపరమేశ్వరులువచ్చి యేమిమీరుయీలాగు విచారించుచు తిరుగు చున్నారు. అనియడిగిరి, అప్పుడువారుమీకెందుకు రాయనావెళ్ళండియని చెప్పగా పార్వతీపరమేశ్వరులు కాదు కూడదు చెప్పవలసినదని యడిగిరి అప్పుడాతలిదండ్రులు లేక లేక మాకీపిల్లయొకర్తుయేపుట్టినది. దీనికి పెళ్ళి చేసినాము. పెండ్లికాగానేభర్త పరలోకగతుడాయెను. ఆదుఃఖము భరించ లేక యీలాగుపిల్లతోతిరుగుచున్నాము అనిచెప్పినారు, అప్పుడాపార్వతీ పరమేశ్వరులు అయ్యోఆపిల్లకిర్రిందజన్మమునసౌభాగ్యతదియలునోమునట్టి ఉల్లంఘనచేసినది. అందుచేతనిట్టియాపదా చిన్నదానికి సంభవించినది ఆపదపోవుటకుగాను తిరిగియానోముపట్టి యుద్యాపన చేసుకోవలసినదని చెప్పినారు మంచిదియని యపుడీ నోముపట్టించి సంవత్సరముపొడుగున పౌర్ణమివెళ్ళినతదియయుపవాసముండి ఎడచేర పెడచేరబియ్యంపోసిమెదు ట మనిషితో మాటలాడకుండా ఉప్పువేయనిచప్పిడితిని యేడాదిఅయిన తరువాత యుద్యాపనచేసుకొనెను.

ఉద్యాపన—వీసెయేబులం పసవు మనిషీతో మాటలాడకుండా కలియకొట్టి 3 వెదురుపెట్టెలలోపోసి పదమూడుకానులుదక్షిణతాంబూ లము 18 లక్కజోళ్ళు 18 రవికెలగుడ్డలు 18 నల్లపూసలకోనలు పెట్టి 18 గురు ముత్తయిదువులకు వాయనమియ్యవలెను. కథ లోపమయినను వ్రతలోపముకాకూడదు. భక్తితప్పినను ఫలముతప్పదు.

## మాఘపాదివారముకథ.

మాఘపూర్ణిమముందరరథసప్తమినాడు సోములారి సోమిదేవమ్మ పసపువార్రసుకొని స్నానముచేసి పచ్చనియక్షతలుచేతపట్టుకొని కుమారు లారా నాపాలింటి మాఘపాదివారములకథ వినవలయునని కోడుకులను

పిలిచియడిగెను. అంతట నొక కుమారుడు మాకేమి కథ మాకేమి
కారుణ్యమమ్మా రాజుగారు కచ్చేరికి వచ్చెడువేళయైనది. అక్కడికి
పోవలెనని చెప్పి యట్లు కచ్చేరికి వెళ్ళెను. రాజుగారు నింతకుమున్దుగానే
కచ్చేరికివచ్చి యాలస్యముగావచ్చిన యీబ్రాహ్మణ కుమారుని దేవిడీ
మన్ననచేసినారు అప్పుడాకుమారుడు సోములారిసోమిదేవమ్మకథ వినని
దోషము కట్టికుడిపినదని చింతించుచు తనగృహమునకువెళ్ళెను. సోమిదేవ
మ్మ మనుమలనుపిలిచి మనుమలారానాపాలింటి మాఘపాది వారముల
కథవినదరాఅనియడుగగా బడికిపోవలెను పంతులుకొట్టిపోవును అని చెప్పు
చు మనుమలుబడికివెళ్ళిరి. ఇంతపొద్దుపోయిరావడమేమియని పంతులా
బాలురనుకొట్టిరి. అప్పుడాచిన్నకుర్రలు సోములారిసోమిదేవమ్మకథవినని
దోషముకట్టికుడిపిందియని యనుకొనిరి. సోములారిసోమిదేవమ్మతనకోడ
లనుపిలిచి కోడలా నాపాలింటిమాఘపాదివారములకథ వినవాయని యడు
డుగనా కేమికథ నాకేమికారుణ్యమమ్మా నాపిల్లలకుపాలు ఉగ్గుపోసు
కొనవలెననికోడలుచెప్పి ఉయ్యాలలోనున్న తనబిడ్డయొద్దకువెళ్ళి చూచు
నప్పుడుఉయ్యాలలోనిబాలకొయ్యబారిపోయెను. అప్పుడాకోడలుఅయ్యో-
సోములారి సోమిదేవమ్మకథవిననిదోషము కట్టికుడిపినదని విచారించెను
తిరిగిసోములారిసోమిదేవమ్మనీళ్ళరేవుదగ్గరకువెళ్ళి నీరాడెడుయక్కలారా
యని నీళ్లరేవునిస్నానముచేయుకాంతలనుబిలిచి నాపాలింటి మాఘపాది
వారములకథవినదరాయనియడిగెను, అప్పుడాస్త్రీలు మేమునీళ్ళు పాలు
తెచ్చుకొనవలెనమ్మాఅనిచెప్పి నీళ్లకడవలు భుజములపయి నుంచుకొన
బోగానవివిచ్చిపోయినవి. అయ్యోసోములారి సోమిదేవమ్మకథవిననిదోష
ము కట్టికుడిపినదియని చాలా స్త్రీలందరువిచారించిరి, పిమ్మటసోములారి
సోమిదేవమ్మవీథిలోనికివచ్చి నిలుచుండగానొకబ్రాహ్మణుడెదురుగుండా
వచ్చెను, అప్పుడాసోములారిసోమిదేనమ్మ బ్రాహ్మణుని పిలిచి బ్రాహ్మ

ణుడా నాపాలింటి మాఘపాదివారముకథ వినవాయనియడుగ నాబ్రా
హ్మణుడు పంచాంగముచెప్పుకోవలెనని చెప్పి రాజుగారియింటికివెళ్ళేసరికి
తలుపులుమూయబడివెళ్ళుటకు వీలులేకపోయెను. అంతట బ్రాహ్మణుడు
సోములారిసోమిదేవమ్మకథ వినని దోషము కట్టికుడిపిందని విచారించుచు
పోయెను. తరువాతసోములారిసోమిదేవమ్మకు మేదరవాడెదురుగా వచ్చే
సరికి నాపాలింటిమాఘపాదివారములకథవినవాయని వానినడుగ మాకే
మికథ మాకేమికారుణ్యమమ్మా తట్టబుట్టనల్లుకోవలెనని మేదరివాడు
వెళ్ళి తట్టలల్లుకొనుచుండగా కత్తి విరిగిపోయినది, అయ్యో సోములారి
సోమిదేవమ్మకథవిననిదోషము కట్టికుడిపినదని మేదరవాడు చింతించెను.
పిమ్మట ఉప్పరివాడు కనపడ వానినిపిలిచి ఉప్పరీ నాపాలింటి మాఘపాది
వారములకథవినవాయనియడుగ వాడుమాకేమికథ మాకేమికారుణ్య
మమ్మా గట్లుపుట్లపెట్టుకొనిపోవలెనని చెప్ప గట్టుపుట్ట పెట్టుకొనుటకు
పోగా గడ్డపారవిరిగిపోయెను. అయ్యోసోములారి సోమిదేవమ్మకథవినని
దోషముకట్టికుడిపిందని యుప్పరివాడనుకొనెను, తరువాత చాకలివాడు
యెదురుగావచ్చుచుండ చాకలివానినిపిలిచిచాకలీనాపాలింటిమాఘపాది
వారములకథవినవాయని సోములారిసోమిదేవమ్మ అడిగెను. వాడందుకు
మాకేమికథ మాకేమికారుణ్యమమ్మా రాజుగారికిబట్టలారవేయుటకు
పోవలెననిబదులుచెప్పి యింటికిపోగా గాలివానవచ్చిబట్టలెగరకొట్టుకొని
పోయినవి. అయ్యోసోములారి సోమిదేవమ్మకథ వినని దోషము కట్టికుడి
నదనియనుకొనెను తరువాతకుమ్మరివాడెదురుగావచ్చెను అప్పుడువానిని
పిలిచికుమ్మరీ నాపాలింటిమాఘపాదివారములకథ వినవాయనియడుగ
వాడునాకేమికథ నాకేమికారుణ్యమమ్మా రాజుగారికివెండిబానపయిడి

బాన చేయుటకుపోవలెనని చెప్పి యింటికిపోయి వంటిబాన వయిడిబాన చేయబోవునప్పుడు కుమ్మరిసాన విరిగిపోయెను. అప్పుడువాడయ్యోసామి దేవమ్మ కథవినని దోషము కట్టుకుడిపినదని యనుకొనెను. కొంతకాలమున కుప్పరమాదేవి యెదురురాగా సోములవారి సామిదేవమ్మ ఉప్పరమాదేవిని పిలిచి నాపాలింటి మాసుపాదివారములకథ వినెదవాయని యామెనడిగెను. అప్పుడామె యిట్లు చెప్పెను వినుము నిన్నశనివారముపంటిపూట భోజనము ఈరోజుఆదివారము మానెనుపాలలో చేరెడుబియ్యముపోసి పెట్టినకథవినదనని చెప్పెను. మంచిది సోములవారి సామిదేవమ్మ మానెనుపాలలో చేరెడుబియ్యంపోసి పెట్టినది తిని యుప్పరమాదేవిగట్టుమీద పడుకొని నిదురపోయినది ఆమె కడుపులోనున్నపిల్ల సోములవారి సామిదేవమ్మతో మాఅమ్మ బొడ్డుమీద నక్షతలువేసి కథ చెప్పవమ్మా వినెదమని చెప్పెను. అట్లుబొడ్డుమీద నక్షతలు వేసి సోములవారి సామిదేవమ్మ

పాడుపూళ్ళుపట్నాలవును పట్టిజోజో పాపజోజో
పట్టిమాన్లుపండ్లుపండు పట్టిజోజో పాపజోజో
పట్టిమూవులపాలనిచ్చు పట్టిజోజో పాపజోజో
గొడ్డువాండ్రు బిడ్డలగందురు పట్టిజోజో పాపజోజో
వేగివేసిన వెయివేలుపండు పట్టిజోజో పాపజోజో
నూర్చివేసిన నూరువేలుపండు పట్టిజోజో పాపజోజో
కోసివేసినకోటివేలుపండు పట్టిజోజో పాపజోజో
రాతిమీదను రాజనాలుపండు పట్టిజోజో పాపజోజో
పత్తిగింజలు ముత్యాలౌను పట్టిజోజో పాపజోజో
చచ్చినపురుషుడు లేచివచ్చును పట్టిజోజో పాపజోజో
ఏడువారాలనగలు నష్టేటిలోపడిన నట్టింటకువచ్చుపట్టిజోజో పాపజోజో

అనిబాడుచు కథచెప్పుకొనెను. అప్పుడుప్పరమాదేవిలేచి సోమి దేవమ్మా కథచెప్పుకొనవమ్మా వినెదను అని సోములారి సోమిదేవమ్మ తో పలికెను అమ్మా నీకడుపులోనిపిల్ల ఆలకించినది నేనుకథచెప్పుకొ న్నాను ఆడుశిశువుపుట్టినను మగశిశువుకలిగినను నాకుకబురుచేయుమని సోములారి సోమిదేవమ్మ చెప్పెను. అప్పుడుప్పరమాదేవి యుప్పరపాకల లోనికివెళ్ళి సోమిదేవమ్మ కిట్లనివర్తమానముచేసెను, ఉప్పరమాదేవి నీళ్ళాడినది ఆడశిశువు కలిగెను. రావలసినదని వర్తమానముచేసెను. ఈవర్తమానమువిని సోములారిసోమిదేవమ్మ ఉగ్గునకొకగిన్నెయుఉయ్యా లకునొక చీర పట్టుకొనివెళ్ళి ఆపిల్లను తీసుకొనివచ్చి యడవిలో వళ్వృక్ష వృక్షమునకుయ్యేలవేసి పక్షులారాపాడండి వృక్షములారా ఊపండిఅని చెప్పి కన్నతల్లిగట్టుపుట్టపెట్టుకొనుటకుపోగా పెంచినతల్లియింటికివచ్చినది పక్షులానందముగ పాడుచుండెను. వృక్షములూగుచున్నవి ఒకరాజు నవారిమెక్కి ఆమార్గమునబోవుచు పక్షులపాటయు బాలరోదనము నువిని యిదియేమిమో కనుగొనుమని తనపరిచారకునితో చెప్పెను వాడువెరచి చెప్పుదునా వెరవక చెప్పుదునాఅనిఅడుగ రాజు వెరవకచెప్పుమనెను. అప్పుడువాడు మహారాజాగారితో మాకయినమాత దేవరవారికయిన దేవి యనిచెప్పెను. అంతటనామహారాజు తననవారి యాయశ్వద్ధవృక్ష సమీపమునకు పట్టించియాబాలను తనపల్లకిలోనుంచుకొని పాడువూరి లోనికి తీసుకొనివచ్చినాడు ఆపాడుగ్రామముగొప్పపట్టణమయి కడునం దముగా నొప్పుచుండెను అంతఇదేమి చోద్యముగంటిని అక్కాఅనెను. తవాకత నాపసిబాలను పత్తిగింజలోపరుండబెట్టి పయినిపత్తిగింజలేకప్పి నారు ఈబాలశరీరస్పర్శచే పత్తిగింజలన్నియు ముత్యాలయినవి. ఇదేమి చోద్యముగంటిని అక్కాఅనెను. వేయించివేయగా వేనవేలుపండినవి, ఇదేమిచోద్యముగంటిని అక్కాఅనెను. నూర్చివేయగానూరువేలు పండి

నవి ఇదేమిచోద్యముగంటినిఅక్కాయనెను వట్టిరూపును తీసుకొనివచ్చి
కట్టిపెట్టినారు పాలుయిచ్చినది యిదేమిచోద్యముగంటిని అక్కాఅనెను
వట్టిమాన్నినితీసుకొనివచ్చి పాతిపెట్టగామల్లెపందిరాయెను యిదేమిచోద్యము
గంటిని అక్కాయనెను రాజుగారి పెద్దభార్యచేసిన అప్పినుతీసుకొని
పోగా నామెకుకొడుకుపుట్టెను యిదేమిచోద్యముగంటిని అక్కాయనెను
రాజుగారి పెద్దభార్యయొక్కయు చిన్నభార్యఅయిన ఉప్పరమాదేవిగా
తుకారెయొక్కయు శరీరమందున్న నగలుతీసి యొకబరిణెలోనుంచి యాబ
రిణెసముద్రములోపారవేయగాదానినొక చేపమ్రింగెను. వల్లెవాడొకడు
వలవేయగా నాచేపవానికిదొరికెను అప్పుడావల్లెవాడాచేపను రాజుగా
రికి కానుకగానంపెను తిన్నగానాచేపను రాజుగారి పెద్దభార్య గృహ
మునకుపట్టుకొనిపోయియిచ్చిరి రాజుగారు పిండలకడ వంటచేయువలసి
నదనియు భోజనమునకు వచ్చెదననియు తన పెద్దభార్యకు వర్తమానము
చేసెను అంతట నగనాయందానికిని పెండ్లినాకూతు యుండెను యుప్పర
మాదేవికి పెద్దభార్యపంపివేసినది ఉప్పరమాదేవియు మంచిదారనచ్చిన
దని కత్తిపీటముందరవేసుకొని తరిగినోయేసరికి మల్లెన చేపకడుపులో
నుంచి నగలబరిణెపడినది నాపాలిటిమహాలక్ష్మి నాయింటికివచ్చినదని పా
లచేతకడిగి పళ్ళెరములోపెట్టుకొని యుప్పరమాదేవి పేరువారాలనగలు
ధరించి పద్మాలపట్టుచీరకట్టుకొని రాజుగారిని భోజనమునకురమ్మని కబు
రుచేసినది నగలుపోతేనగలుతెచ్చుకొన్నది నేనుపోయిన తిరిగిన న్నేలాగు
న తెచ్చుకొనునో చూతుముగాకయని చిన్నభార్యయయిన యుప్పరమా
దేవియింట్లో భోజనముచేసి పెద్దభార్యయింట్లో విషముతినిచనిపోయెను
అప్పుడుచచ్చినపురుషుని వంటయింటపెట్టి పెద్దభార్యతనపతిని సహాగ
మనమునకురమ్మనిపిలిచినది సతియగు వుప్పరమాదేవియు పసుపుకలిపి
పళ్ళెరములోపోసుకొని కుంకుమకొని కుడుకమీద పెట్టుకొని తలుపున
కడక వేసి వెళ్ళుచున్నది అప్పుడాదినారాయణమూర్తి ఆమెను

పోలేరంటమయి ఏమమ్మా ఎక్కడికివెళ్ళుచున్నావని యడిగెను. చచ్చిన పురుషుడు నట్టింటయున్నాడు సవతిసహగమనము చేయుచున్నది రాచమాదేవివచ్చింది ఉప్పరమాదేవిరమ్మని కబురు పంపించినారు పసుపుకొని పళ్ళెరములోపోసుకొని కుంకుమకొని కుదురుమీదపెట్టుకొని తలుపున తడక వేసి తొందరగా వెళ్ళుచున్నాను అనియుప్పరమాదేవి చెప్పెను అప్పుడాయన సౌభాగ్యవతీభవ అంతపనిపుట్టరాదు నాకు కాళ్ళుకడుగుకొనుటకునీళ్ళుయిచ్చి నీవుకూడా కాళ్ళుకడుగుకోవమ్మా అనిపలికినాడు. ఆమెయుబ్రాహ్మణ నేమముతో వచ్చిన నారాయణమూర్తికి కాళ్ళుకడుగుకొనుటకునీళ్ళుయిచ్చిదానుకూడా కాళ్ళుకడుగుకొన్నది తిరిగియూబ్రాహ్మణుడు నాకుదాహమిచ్చి నీవు దాహముపుచ్చుకోవమ్మాయని చెప్పినాడు చచ్చినపురుషుడు నట్టింటయున్నాడు సవతిసహగమనము చేయుటకు వెళ్ళుచున్నది పసుపుకొని పళ్ళెములోపోసినాను కుంకుమకొని కుదురుమీద పెట్టినాను తలుపునతడక వేసినాను కాళ్ళుకడుగుకొని గాళ్ళుదాచినాను దాహ మెక్కడదాచనమ్మా అనియుప్పరమాదేవిచెప్పెను అప్పుడాబ్రాహ్మణుడు సౌభాగ్యవతీభవ అంతపనిపుట్టరాదు నాకు దాహమిచ్చి నీవుదాహముపుచ్చుకోవమ్మాయని చెప్పెనుఆప్రకారమూ బ్రాహ్మణునికి దాహమిచ్చి తానుకూడా దాహముపుచ్చుకొన్నది తరువాతనాబ్రాహ్మణుడు నాకుతలయంటి నీవుకూడా తలయంటుకోవమ్మా అని చెప్పెను. చచ్చినపురుషుడు నట్టింట నున్నాడు సవతి సహగము చేయుచున్నది పసుపుకొని పళ్ళెములోపోసినాను కుంకుమకొని కుదురుమీద పెట్టినాను తలుపున తడక వేసినాను కాళ్ళు కడుగుకొని కాళ్ళు దాచినాను దాహముత్రాగి దాహము దాచినాను తలయంటుకొని తల యెక్కడ

దాచవయ్యాఅనెను. సౌభాగ్యవతీభవ అంతనిపుట్టరాదు నాకుతలంటి
నీవుకూడాతలంటుకొనవమ్మా అని బ్రాహ్మణుడు పలికినాడు అప్రకారము
ఆబ్రాహ్మణునికి తలంటి తానుకూడా తల [illegible] తిరిగి [illegible] బ్రా
హ్మణుడా మను అనిననేమనగా [illegible] గంధమిచ్చి యామెను పసుపు
పూసుకొనుమనెను వచ్చినపురుషుడు నట్టింటనున్నాడు సవతిసహగమ
నముచేయుచున్నది పసుపుకొని వళ్ళె[illegible] పోసినాను [illegible]కొని కు
దురుమీద పెట్టినాను తలుపునతడక వేసినాను [illegible] కడుగుకొని కాళ్ళు
దాచినాను దాహముపుచ్చుకొని దాహముదాచినాను తలయంటుకొని
తల దాచినాను పసుపురాచుకొని మొగముదాచవయ్యా అనియామె
జవాబుచెప్పెను. సౌభాగ్యవతీభవ అంతవనిపుట్టరాదు నాకుగంధమిచ్చి
నీవుపసుపురాసుకోవమ్మాయని బ్రాహ్మణుడు తిరిగి చెప్పెను. అప్రకారం
బ్రాహ్మణునికిగంధమిచ్చి తానుపసుపుపూసుకొనెను. తిరిగి యాబ్రాహ్మ
ణుడు బొట్టునిచ్చి నీవుకూడాబొట్టుపెట్టుకొనవమ్మాయని చెప్పెను. వచ్చి
నపురుషుడు నట్టింటనున్నాడు సవతిసహగమనముచేయుచున్నది పసపు
కొనివళ్ళెములోపోసినాను కుంకుమకొని కుదురుమీదపెట్టినాను తలుపున
తడకవేసినాను కాళ్లుకడుగుకొని కాళ్ళుదాచినాను దాహముపుచ్చు
కొని దాహముదాచినాను తలయంటుకొని తలదాచినాను పసుపురాచు
కొని మొగముదాచినాను బొట్టుపెట్టుకొని బొట్టెక్కడ దాచవయ్యా
అనెను. సౌభాగ్యవతీభవ అంతవనిపుట్టరాదు నాకుబొట్టునిచ్చి నీవుబొట్టు
పెట్టుకొనవమ్మాయని బ్రాహ్మణుడు పలికెను. అప్రకారము బ్రాహ్మ
ణునికి బొట్టునిచ్చి తానుకూడబొట్టుపెట్టుకొనెను తిరిగి యాబ్రాహ్మణు
డు నాకుభోజనము పెట్టి నీవుభోజనముచేయవమ్మా అనియామెతో చెప్పెను
వచ్చినపురుషుడు నట్టింటనున్నాడు సవతి సహగమనము చేయుచున్నది.
పసుపుకొని వళ్ళెముపోసినాను కుంకుమకొని కుదురుమీద పెట్టినాను.
కాళ్ళుకడుగుకొని కాళ్ళుదాచినాను దాహముపుచ్చుకొని దాహముదా

చినాను తలయంటుకొని తలదాచినాను పసుపురాసుకొని పసుపుదాచి
నాను బొట్టుపెట్టుకొని బొట్టుదాచినాను అన్నముతిని కడుపెక్కడదాచి
నయ్యాయని ఆమెచెప్పెను. సౌభాగ్యవతీభవ అంతపనిపుట్టరాదు నాకు
భోజనముపెట్టి నీవుభోజనముచేయుమమ్మా అని ఆబ్రాహ్మణుడు పలికెను.
ఆప్రకారము బ్రాహ్మణునకు భోజనముపెట్టి తానుకూడా భోజనముచే
సెను, అప్పుడాబ్రాహ్మణుడు నాకుతాంబూలమిచ్చి నీవుకూడా తాంబూ
లమేసికొనవమ్మా అనిచెప్పెను చచ్చినపురుషునట్టింటనున్నాను సవతి
సహగమనము చేయుచున్నది పసుపుకొని పళ్ళెమున పోసినాను కుంకు
మకొని కుడుకుమీదపెట్టినాను కాళ్ళుకడిగికొని కాళ్ళుదాచినాను దా
హము పుచ్చుకొని దాహముదాచినాను తలయంటుకొని తలదాచినాను
పసపురాచుకొని పసపుదాచినాను బొట్టుపెట్టుకొని బొట్టుదాచినాను అ
న్నముతిని అన్నముదాచినాను తాంబూలము వేసికొని నోరెక్కడదాచి
నయ్యాయని ఆమెచెప్పెను. సౌభాగ్యవతీభవ అంతపని పుట్టరాదు నాకు
తాంబూలమిచ్చి నీవుకూడా తాంబూలము వేసికొనవమ్మా అని బ్రా
హ్మణుడుపలికెను. ఆప్రకారము బ్రాహ్మణునకు తాంబూలమిచ్చి తాను
కూడా తాంబూలము వేసికొనెను అప్పుడా బ్రాహ్మణుడు దివ్యమంగళవి
గ్రహుండయి శంఖుచక్రగదాధరుండయి యాదినారాయణమూర్తియా
మెకు ప్రత్యక్షమయ్యెను. అప్పుడామె మెచ్చితినయ్యా శంఖుచక్రగదాధ
రుండా నిన్నుకోరితి వరమీయవయ్యా యనికోరెను. ఇచ్చితిపుణ్యకో
మని వచ్చినయక్షతలె ఆమెచేతిలో నారాయణుండుంచినాడు నీవువెళ్ళే
నదికి కట్టకమీదపురుషుని కాటిమీదపెట్టుచుందురు అప్పుడునీవుమూడు
ప్రదక్షణములుచేసి యక్షంతలు మీదచల్లవలెను. చల్లినవెంటనే నీపురు
షుండు లేచికూర్చుండును అని నారాయణమూర్తి చెప్పెను. ఆప్రకార
మామె యక్షతలుపట్టుకొని వెళ్ళి మూడుప్రదక్షణములుచేసి యాయక్ష
తలుమీదచల్లేవరికి యెంతనిద్రపోయిలేచినానుఅని యామెభర్త లేచికూ

త్పించెను. అప్పుడందరు ఆశ్చర్యమునొంది యేమినోముపట్టితివమ్మా యు
ని యాబాలగోపాలమూ మెనునడుగగా నారి ఏమినోముపట్టలేదు ఏమివ్రత
ముపట్టలేదు మాఘపూర్ణిమయుందున రథసప్తమినాడు మాఘపాదివార
ములనోముపట్టి నోములాంటి నోముచేసిన్నా ఫలమే కాని యుకోరలువేసు
కున్నది అదేఘనేను విన్నాను విన్నఫలమే కాని పట్టినఫలము కాదిది అని
యామె చెప్పెను. విన్నంతమాత్రమున యింతఫలంవచ్చిన నోముపట్టిన
యెంతఫలమువచ్చునోయని రాజునయిద్దరుభార్యలుచేత నోముపట్టించి
నాడు వారుపట్టిననోమే కలియుగమునందలి యందరూపట్టినారు నోము
పట్టినసంవత్సరము పాలుత్రాగకూడదు మరుచటిసంవత్సరము మజ్జిగ త్రా
గరాదు మూడవసంవత్సరము పప్పుతినరాదు నాలగవయేడు తలంటుకో
రాదు అయిదవయేడు తాంబూలము వేసుకొనరాదు అయిదేండ్లనం
తరము.

దీనికి ఉద్యాపనము—తలయంటుకొని సంవత్సరము అయినగుడు
ముత్తయిదువలకు తలంటి పప్పుతినిపించుట బూరెలువంటి పాలుత్రాగని
యేడు పరమాన్నమువంటి చల్లత్రాగనియేడు పెరుగువడ్డించి తాంబూ
లము వేసుకొననియేడు తాంబూలమిచ్చి యూప్రకారముఅయినగురుముత్త
యిదువులకు అయిదురవికెలగుడ్డలిచ్చి ఆదినారాయణమూర్తికి అయిదు
మూళ్ళ అంగవస్త్రమిచ్చి బ్రాహ్మణునకు గిన్నెయు ఉయ్యాలవ చీరయునిచ్చి
యుద్యాపనచేసుకొనవలెను.

## ఉండ్రాళ్లతద్దెకథ.

పూర్వకాలమున నొకరాజునకిద్దరుభార్యలుండిరి ఒకనాడారాజు
భార్యలును నాపట్టణస్త్రీలును ఉండ్రాళ్లతద్దెనోము నోచుకొనుచుండిరి
రాజుగారుంచుకొనినవభోగముదిరాజుగారుదానియింటికివచ్చునరికిమునుగు

వేసుకొని యొకచోట పెట్టుకొనియుండెను అంతమీద యారాజుని వారు
వలననిట్లున్నదానవరియడిగెను కే[illegible]ంపాప్రశ్నద్దకే [illegible]నోమునోచుకొన
వలయును కాబట్టి [illegible]న్నివస్తువులు [illegible]నతె ని యాభోగముది చెప్పెను
నీకేమివస్తుసామగ్రి కావలెనో చెప్పుము [illegible] [illegible]నివని అని
యారాజుపలుకగా వాభోగముది చెప్పె గి[illegible] కూరగీర [illegible] వ్వ బియ్యము
గియ్యము పుల్లగిల్ల [illegible] [illegible] చెక్క[illegible] [illegible]బ్బుగిబ్బురసుపు
గిసుపు కుంకుమగింకుమ బెల్లము [illegible] [illegible]తెలు [illegible] [illegible]గీను నోము
నోవలెను పట్టించుకొని రావలెనని చెప్పెను [illegible]జును ఆ వస్తుసామగ్రిని
తెప్పించెదనని చెప్పి యంతట యిటెవలి కొండకు సేవకులను వెసుకొని యా
పట్టణమెల్లచోట్లతిరిగి వర్తకులు మొదలయినవారి వా[illegible] వస్తువుల నడిగెను
ఆవర్తకులుమాయొద్దనన్నియునున్నవి గాని గియ్యనవస్తువులు మాత్రము
లేవనిచెప్పిరి రాజునుతిరిగితిరిగి మూడుజాములకు వేశ్యాకాంత యింటికి
వచ్చెను అప్పటికాభోగముదికుండలన్నియు కడిగి యొకకుండలో పోసియుం
చెను రాజుగారురాగానే యావస్తువులన్నియు తీసికొనివచ్చితిరాయని యా
భోగముస్త్రీ యడుగగా నాతడన్నియు దొరకినవి కాని గియ్యనవస్తువులు
మాత్రము దొరకలేదని చెప్పెను పోనిండు నోముఅయిపోయినదని చెప్పి యా
కుండలోనుంచిననీళ్ళు తీసుకొనివచ్చియారాజు మొగము మీద పోసెను
అతడంతట కోపగించుకొనక యావస్తువులీ నేను తెప్పించలేను నీయిష్ట
మువచ్చినట్లునోచుకొమ్మని చెప్పెను.అప్పటికిపొద్దుకుంకునమయమయ్యె
ను అప్పుడుకుండ్రాళ్ళు వండుకొని ముత్తయిదువను దీసికొనివచ్చి అయిదు
కుండ్రాళ్ళునైవేద్యముపెట్టి అయిదుకుండ్రాళ్ళును వాయనమును దక్షిణ
తాంబూలముముత్తయిదువకిచ్చి యావేశ్యకాంత యథావిధిగ నోమునో
చుకొనెను ఈప్రకారము అయిదేండ్లు నోమునోచుకొని అయిదుగురు

అనుచక్కఁ జేసికొని గయ్యాళిగాక మితముగాను ప్రియముగాను భాషించు చుండెను ఇట్లుండ అప్పతివ్రతయందు మహాలక్ష్మికి అనుగ్రహము కలిగి యొక నాడు స్వప్నమున కనపడి ఓ చారుమతీ నేను వరలక్ష్మీదేవిని నీయందు దయ వచ్చి ప్రత్యక్షమయితిని శ్రావణశుక్ల పూర్ణిమకు ముందుగా వచ్చెడు శుక్ర వారము నాడు నన్ను పూజించిన నీకోరికలు నెరవేర్చెదనని యానతిచ్చిన చారుమతి స్వప్నములోనే వరలక్ష్మీదేవికి ప్రదక్షిణనమస్కారములు చేసి,

శ్లో. నమస్తే సర్వలోకానాం జనన్యై పుణ్యమూర్తయే
శరణ్యే త్రిజగద్వంద్యే విష్ణువక్షస్థలాలయే॥

అని యనేక విధముల స్తుతియించి ఓ తల్లీ నీకటాక్షంబు కలిగెనేని జనులు ధన్యులుగను విద్వాంసులుగను సకలసంపన్నులుగను నయ్యెదరు నేను పూర్వజన్మమున చేసిన సుకృతవిశేషమున నీపాదసందర్శనము నాకు లభించెను అని స్తుతియించిన మహాలక్ష్మి సంతోషము జెంది చారుమతి కనేక వరంబులొసగి యంతర్ధానమొందెను చారుమతి వెంటనే నిదుర మేల్కాంచి గృహము నాలుగుదిక్కులను కలయం జూచి వరలక్ష్మీదేవిని గానక ఓహో నేను కలగంటినని యా స్వప్నవృత్తాంతమును భర్త మొదలగు వారితో జెప్పవారు ఈ స్వప్నము మిగుల నుత్తమమైనది శ్రావణమాసంబు వచ్చినప్పుడు నీవు వరలక్ష్మీవ్రతమును తప్పక చేయవలయునని చెప్పిరి తరువాత చారుమతియు స్వప్నంబు విన్న స్త్రీలును శ్రావణమాసము యెప్పుడు వచ్చునని యెదురుచూచు చుండిరి ఇట్లుండ వారి భాగ్యవశమున శ్రావణపూర్ణిమకు ముందుగ వచ్చెడి శుక్రవారము వచ్చెను అంతట చారుమతి మొదలగు స్త్రీలందరును ఉదయమే కదా వరలక్ష్మి చెప్పిన దినంబని స్నానాదుల నాచరించి ధౌతాంబరములు ధరించి చారుమతి గృహంబున నొకచోట గోమయంబుచే నలికి మంటపమేర్పరచి యందాసనము వైచి దానిపై క్రొత్తబియ్యము పోసి మఱ్ఱిచిగుళ్ళు మొదలగు పంచపల్లవములచే కలశంబు నేర్పరచి యందు వరలక్ష్మీ

భాగ్యముకలిగెనని చారుమతీదేవిని మిక్కిలికొనియాడిరి తరువాతచారు మతీదేవిమొదలగుకాంతలెల్లరును నీవ్రతంబును ప్రతిసంవత్సరము జేయుచు పుత్రపౌత్రాభివృద్ధికలిగి ధనకనకవస్తువాహనసమృద్ధిగాంచి సుఖముగ నుండిరి కావున నోపార్వతీ యీయుత్తమవ్రతమును బ్రాహ్మణులు మొదలు నాలుగుజాతులవారును జేయవచ్చును అట్లు చేసిన సర్వసౌభాగ్యంబులుగలిగి సుఖింతురు ఈకథవినువారలకును చదువువారలకును వరలక్ష్మిప్రసాదము వలన సకలకార్యసిద్ధికలుగును.

## మొగదోసిళ్ళకథ.

ఒకబ్రాహ్మణునికూతురు మొగిదోసిళ్ళనోము పట్టి యుల్లంఘ నముచేసిచనిపోయెను ఆమె మరుజన్మమున మరియొకబ్రాహ్మణునియింట పుట్టెను అల్పకాలములో తల్లిచనిపోవుటచేత నామెకు సవతితల్లి వచ్చెను. ఆమెదరిద్రబాధకలిగినదై యోర్చుకొనజాలక యొకనాడు దేవాలయము లోనికివెళ్ళి ధ్వజస్తంభమువద్దకూర్చుండి యెంతయు వ్యసనపడి విచారించుచు పరమేశ్వరునిప్రార్థించుచుండెను కొంతకాలమునకామె మొరను దయగల వాడయి యీశ్వరుడుప్రత్యక్షమై ఏమియోచిన్నదానా యిట్లు విచారించు చున్నావని యడిగెను బ్రాహ్మణకూతురుచే ప్రత్యక్షమయిన యీయీ శ్వరునినామె సామాన్యమనుజునిగనెంచి నాయనా మీరెందుకువెళ్ళండని ప్రత్యుత్తరమిచ్చెను, అటవినిభగవంతుడు ఓకాంతా నీతలంచు కార్యంబు నేనుదీర్చువాడ చెప్పుమనియడిగెను అంతనామె నేనొక బ్రాహ్మణుని కూ మార్తెను నాకుసవతితల్లియున్నది దరిద్రముతోను సవతితల్లిచేతి బాధపడ లేక యిట్లు విచారించుచున్నానని చెప్పెను అంతనీశ్వరుడు ఓయింతీనీవు పూర్వజన్మమున మొగదోసిళ్ళనోముపట్టి యుల్లంఘనచేసితివి కాబట్టి నీకీ దరిద్రబాధ సవతితల్లిపోరు సంప్రాప్తమయినది నీవిప్పుడీ నోముపట్టి ప్రతి

తివముగోదలికినీళ్ళుపోసుకొని వసువ్రక్కలిపి యొక్కవళ్ళెములో రోజుమూ డుదోసిళ్ళనీళ్ళు లెక్కచూచి పోసుకొని ఏడాదియయినతరువాత మూడు దోసిళ్ళముత్యాలు మూడుదోసిళ్ళపగడములు శివునియాలయములోనికి పట్టుకొనివెళ్ళి శివునిరుద్రాభిషేకము చేసి యథాశక్తి దక్షిణతాం బూలాములనియ్యవలెను. అనిచెప్పి ఈశ్వరుడంతర్ధానము నొందెను. ఆబ్రాహ్మణచిన్నదియు భగవంతుడుచెప్పినరీతి నాచరించి సకలయిశ్వ ర్యసంపన్నురాలయి సుఖంబుననుండెను కథలోపమయినా వ్రతలోపము కాకూడదు భక్తి తప్పినా ఫలముతప్పదు.

ఉప్పుగౌరి.

దాకనిండాఉప్పుపోసి దేకినదాకఅయినోరేవముకొత్తకుండలో మూని దుసోలడు ఉప్పుపోసి రవికలగుడ్డవాసినకట్టి దక్షిణతాంబూలముతో ము త్తయిదువకిచ్చి ఉద్యాపనచేసుకొనవలయును.



శ్రీరస్తు.

# నోములకధలు నెం 6 రు.

## సూర్యపద్మము.

ఒకానొక గ్రామమున నొక బ్రాహ్మణుడు నొక రాజు నొక కోమటి యొక కాపు నొక గొల్లవాడు నుండిరి. వీరు అయిదుగురు అయిదు కుంచములను కొనుక్కొనిరి. ఈ అయిదు కుంచములు రోజురోజునా గ్రామమున నున్న దేవాలయమునకుబోయి తమలో తాము నాతో నిన్న వరహాలు కొల్చినారు నాతో నిన్న వడ్లు కొలిచినారు అని చెప్పుకొనుచుండేవి వాటిలో బ్రాహ్మణకుంచము తన యజమానియగు బ్రాహ్మణునికి దరిద్రమగుటను తనతో యేమి కొల్చినారో చెప్పక యూరక కూర్చుండెడిది ఒకనాడు తక్కిన నాలుగుకుంచములు యధాప్రకారముగ దేవాలయమునకు వెళ్ళెనుగాని బ్రాహ్మణకుంచమారోజున రాలేదు ఏమిచేత బ్రాహ్మణకుంచమారోజున రాలేదు ఏమిచేత బ్రాహ్మణకుంచము రాలేదు అని తమలో తాము కొంతసేపు తర్కించుకొని కొంతసేపు చూచి తమ యిండ్లకు తిరిగి వెళ్ళిపోయెను. మరుచటిరోజున కుంచములన్నియు నా దేవాలయమున జేరి నాతో నిన్న వరహాలు కొలుచుకున్నారు నాతో నిన్న వడ్లు కొలుచుకున్నారు అని చెప్పుకొనుచున్నవి అప్పుడు బ్రాహ్మణకుంచమును జూచి తక్కిన కుంచములు నిన్న ఎందుకు వచ్చినావు కావు అని యడిగినవి పోలమునాకు లుంకగా మాయమ్మగారు నాలో పోసి మూత వేసినందున నిన్నటిరోజున నేను వచ్చుటకు వీలులేకపోయినదని బ్రాహ్మణకుంచము చెప్పెను. అందుమీద తక్కినవి యన్నియు నెప్పుడు చెప్పినా నూకలు అన్నా కొలిచెదరని చెప్పుచుండెదవు అని నిరసించిపలికెను. అంతనా బ్రాహ్మణకుంచము

తద్వారది అందుచేతను నిన్ను వదిలిపెట్టలేను ఈ కారణముచేత నేనీభర్త యు నిన్ను వదిలిపెట్టలేక నిన్ను పుట్టింటికిపంపి నాము కాను అంతేగాని మారే మి కాము అని చెప్పినారు ఇప్పుడేమి చేసినట్లయితే నాకు మా వారికి కలియునో చెప్పవలెనని వారిని యాచిన్నది ప్రార్థించెను క్రిందటి జన్మమున సూర్య పద్మ నోము పట్టినావు అప్పుడు ఉదయంచూచి యుద్యాపన చేసినావు కావు కాబట్టి మీ ఇద్దరికి యిష్టము తక్కువగానున్నది ఇప్పుడీనోముపట్టి యుద్యాపనచేస్తే మీ ఇద్దరు యిష్టముగా నుండెదరు

దీనికియుద్యాపనము—పొద్దు పొడవకుండా దంపతులిద్దరికి తల యంటి నీళ్ళుపోసి మట్టెలు మంగళసూత్రము యిచ్చి చీరయు జామారునా సంగి పొద్దు పొడవకుండా యుద్యాపన చేసుకోమని చెప్పి పార్వతీ పర మేశ్వరులంతర్ధానము నొందిరి.

## నందికేశ్వర వ్రతకథ.

ఒకనాడు కైలాసపర్వతమున వినోదమందిరమున పార్వతి పర మేశ్వరునకు పాదములొత్తుచుండగా పరమేశ్వరుండు పార్వతితో నిట్లని యె ఓ పార్వతీ నీచేతులు మృదువుగానుండక నాపాదములునొచ్చుచున్నవి కావున నీవు నాపాదములొత్తవద్దనియె అందుకు పార్వతి చింతాకులస్వాం తయై దేవా యెందుచేత నిట్లుండు చెప్పవలయునని ప్రార్థించగా పరమేశ్వ రుడు నీవు పరోపకారము చేసినావు కావు అందుచేత నిట్లుండె ననియెను ఇందుకేమి చేసిన నీకష్టదశ పోవునని యడుగ నీశ్వరుడు నీవు నీళ్ల రేవున నీళ్ళపొయ్యి వేసుకొని నీళ్ళుకాచుచు వచ్చిపోవువారికి తలంటి నీళ్లుపోసిన నీచేతులకు మృదుత్వము వచ్చునని చెప్పెను పార్వతి ఆప్రకారమునీళ్ళు కాచి వచ్చిపోయెవారికి పోయుచుండగా నొకపేదరాలు తలంటి నీళ్ళు పోసుకుందామని పిల్లలు తాను అచటికిరాగా వారికిగూడ తలంటి నీళ్ళు పోసెను పిమ్మట వారు పార్వతి యొద్ద సెలవుతీసుకొని పోవుచుండగా

పారిసిజూచి పార్వతీదేవికి భాగ్యమిచ్చెదనని మనస్సులో సంకల్పించుకొనెను
ఆపేదరాలు ఇంటికి వెళ్ళునప్పటికి పెనిమిటి యొకకోకమూట పెసరొకమూట
చేసుకొనివచ్చెను ఆరోజు కారోజు వారికి క్రమముగ భాగ్యమువచ్చెను
అంతనా బ్రాహ్మణుని భార్య బంగారుగాజులు ముత్యాలకమ్మలు పెట్టుకొని వచ్చి
పోవువారికి పనిచెప్పుచుండెను అది చెప్పినపని గా నాళ్ళచెంత చెప్పు
కొనుచుండిరి అప్పుడు పార్వతి నేను భాగ్యమిచ్చిన బ్రాహ్మణస్త్రీ కాబోలు
ఇంటికి వచ్చినదనుకొని ఒక పేదముత్తైదువై ఆ బ్రాహ్మణస్త్రీ
యింటికివచ్చి వాకిటిలో నిలువబడెను ఆ బ్రాహ్మణస్త్రీ బంగారపుపూసలు
ముత్యాలలో నానుచు యీముసలియవ్వ యెందుకు అమ్మా పాలుపొంగు
వచ్చినవి పాలమీదకొంగుపట్టుకొని వెళ్ళుమనెను అప్పుడామె పాల
మీదనిప్పుచల్లి ఇంటికి వెళ్ళి తలగట్టుకొని పడుకొనెను అప్పుడు పరమేశ్వరుడు
వచ్చి యెందుచేత నీలాగుంటివని యడుగగా బ్రాహ్మణుని భార్యకు తాను
భాగ్యమిచ్చినది మొదలుకొని జరిగినచర్య చెప్పి నన్ను అవమానించినది
యామె భాగ్యము తీసివేయవలసినదని పరమేశ్వరుని ప్రార్థించె పరమేశ్వ
రుడు వినాయకుని పంపగా నాతని చూచి యాబ్రాహ్మణస్త్రీ మూడుమానికల
బియ్యము ఉండ్రాళ్ళవంటి పోలెకుడుములు చేయుపోసి పళ్ళెములో చక్కగబెట్టి
చకచాకకిపెట్టక వేకకిపెట్టక వినాయకునికి నైవేద్యము పెట్టెను అతనివిరిని
భాగ్యము తీసివేయుట నాతరము కాదని ఇంకను భాగ్యమునిచ్చి చక్క
పోయెను అప్పుడు మహేశ్వరుండు పంపగా కుమారస్వామికి నా బ్రాహ్మణస్త్రీ
అయిదు మానికెల సెనగలు నీళ్లలోపోసి నైవేద్యము పెట్టెను ఆసెనగలు
తిని యాతడు భాగ్యము తీయుట నాతరము కాదనియింకను భాగ్యమునిచ్చి
వెళ్ళెను అప్పుడు పార్వతీనాథుని పంపగా యాతనినా బ్రాహ్మణస్త్రీ చూచి
అయిదుమానికెలబియ్యము అట్లువంటి పోలెకుడుములు చేయిపోసి పళ్ళెము
పెట్టి యాతనికి నైవేద్యము పెట్టెను అతడు తిని భాగ్యము తీసివేయుట
నాతరముకాదని ఇంక భాగ్యమునిచ్చి చక్క వచ్చెను తిరిగి అర్జునుని పంపగా

నాతనిచూచి యాబ్రాహ్మణస్త్రీ అయిదుమానికెలబియ్యము అప్పాలు వండి నైవేద్యము పెట్టగా నాతడవితిని మరింత భాగ్యమిచ్చి వెళ్ళెను అప్పుడు శివునిపంపగానాతనిచూచి యాబ్రాహ్మణస్త్రీ అయిదుమానికెల నువ్వుపప్పు చిమ్మిలితో కూడ నైవేద్యముపెట్టెను అతడవితిని మరింతభాగ్యమునిచ్చి చక్కపోయెను తరువాత కాలభయిరవునిపంపగా నాతనిచూచి యాబ్రాహ్మణస్త్రీ అయిదుమానికెలమినపప్పుగారెలువండి నైవేద్యము పెట్టెను అతడవితిని యీమెభాగ్యము తీయుటనావల్ల కాదని వెళ్ళిపోయెను పిమ్మట చంద్రునిపంపగా నాతనిచూచి యాబ్రాహ్మణస్త్రీ అయిదుమానికెలబియ్యము చలిమిడిచేసి నైవేద్యముపెట్టెను అతడవితిని యీమె భాగ్యము చెరుపనాతరముకాదని మరింతభాగ్యమిచ్చివెళ్ళెను తరువాత సూర్యునిపంపగా నాతనిచూచి యాస్త్రీ అయిదుమానికెల బియ్యము పరమాన్నము వండి నైవేద్యముపెట్టెను అతడది యారగించి యీమె కింకను భాగ్యమిచ్చి చక్కపోయెను తరువాత నెవ్వరిని వెళ్ళుమన్న మావల్ల కాదు నీవే వెళ్ళుమనిరి అప్పుడు పార్వతీదేవిస్వయముగబయలుదేరి వెళ్ళగా నామెనుచూచి యాబ్రాహ్మణస్త్రీమిక్కిలిభక్తిశ్రద్ధలతో అయిదుమాని కెలబియ్యము పులగమువండి నెయ్యిబెల్లముతో నైవేద్యముపెట్టెను ఆమె అదితిని కోపముపోయినదయి అమ్మా మొదట నీమీదనాకుకోపమువచ్చి నీభాగ్యము తీసివేయుట కందరినిపంపినాను వారందరికి అన్నిచేసిపెట్టి నావు అందుచేతనీభాగ్యము మరింతవృద్ధిఅయినది అందుచేతనాకుకూడా సంతోషమువచ్చినది ఈనోముపట్టికథ చెప్పిఅక్షింతలు వేసుకొనిఈతొమ్మిది దినుసులు మిగలకుండాచేసి ఉద్యాపనముచేసుకొన్నయడల సకల భాగ్యములుకలుగునని పార్వతీదేవి యదృశ్యమయ్యెను.

ఉద్యాపనము — అయిదుమానికెలపెసరపప్పు బిందెతోఅత్తెనరు పెట్టి అయిదుమూళ్ల అంగవస్త్రముచుట్టపెట్టి బంగారపునందినిచేయించి అయిదుడబ్బులు దక్షిణ తాంబూలముతో వడకవేళ నందిమోహానవు

శ్వరునకు ప్రాణమువిూదికి రాగా నట్టింట పెట్టి దయగల తమ్మునిపెండ్లికి వెళ్ళినదన్నానని చెప్పెను నీవెందుచేతనీలాగు చెప్పినావని యడుగగా బ్రాహ్మణస్త్రీకివిఘ్నకాంతయిట్లని చెప్పెను నీవుపూర్వజన్మమునవిఘ్నకాంత నోముపట్టి ఉల్లంఘన చేసినావు అందుచేతనీతమ్మునికి పెండ్లికల పెట్టినప్పుడు పెనిమిటికి ప్రాణముమిూదికి వచ్చుచుండెను ఇప్పుడునీవానోముపట్టఉద్యాపనచేసుకొని అక్షతలు వేసుకొన్నయడల నీ ఐదువతనము వృద్ధియగునని చెప్పెను.

దీనికిఉద్యాపన—ఏడాది అయిన తరువాత పదమూడుజోడుల నేతిగారెలు వాయనము పదమూడుజోడాలు నైవేద్యం పెట్టి విఘ్నకాంత పువ్వులతో పూజచేసుకొని దక్షిణ తాంబూలములతో ముత్తయిదువనకు ఇవ్వవలయును కథలోపమయినా వ్రితలోపము కాకూడదు భక్తితప్పినా ఫలము తప్పదు.

## కందగౌరి.

ఒకబ్రాహ్మణునకొక కొమార్తె కలదు అచిన్నది అన్నమానము చేయుచుండెను ఎన్నినోములు నోచినను ఏమ్పుటమాన లేదు తండ్రి కూతురుని అడవిలోకి తీసుకొని వెళ్ళి విచారించుచుకూర్చునియుండగా పార్వతీపరమేశ్వరులు భూమిపాలించడను వచ్చి ఏమి బ్రాహ్మణుడా యిక్కడ కూర్చుండి విచారించుచున్నావని యడిగిరి మీ కెందుకు అర్చెడివారా తీర్చెడివారా వెళ్లండిఅనియాబ్రాహ్మణుడు చెప్పగా అర్చేవారము మేమే తీర్చేవారము మేమే చెప్పవలసినదని తిరిగియాబ్రాహ్మణుని పార్వతీపరమేశ్వరులడిగిరి అప్పుడా బ్రాహ్మణుడు ఈపిల్ల ఊరక యేమ్పుచుండెను అందుచేత భరింప

జాలరివాడనై యిక్కడికితీసికొనివచ్చి ఏమియాలోచక విచారించుచున్నా
నని చెప్పగా పార్వతీపరమేశ్వరులు ఈ చిన్నదికిగ్రిందటిజన్మమున కందగౌరి
నోముపట్టి ఉల్లంఘనచేసినది అందుచేతనీయేమ్ప్రసంభవించినది ఇప్పుడైనా
ఏడాదికథచెప్పి అక్షింతలువేసుకొని పీసెడేబియ్యం కొంచదుంప వెండిదుంప
బంగారపుదుంపచేయించి ముత్తయిదువకురవికలగుడ్డదక్షిణ తాంబూలము
వల్లపూనలులక్కజోడు పెట్టి వాయనమియ్యవలెనని నీయేమ్ప్రుడుకు
నని చెప్పి వారంతర్ధానముచెందిరి అప్పుడాబ్రాహ్మణుడు కూతునుతీసు
కొని యింటికివెళ్ళి పార్వతీపరమేశ్వరులు చెప్పినప్రకారము యధావిధిగ
కందగౌరినోముపట్టించి ఉద్యాపనముచేయించెను నాటినుండియాబ్రాహ్మ
ణుని కుమార్తె యేమ్ప్రమాని సకలసంపదలతో భూలోకమున సమస్త
సౌఖ్యములననుభవించెను కథలోపమయినను వ్రతలోపము కాకూడదు
భక్తితప్పిన ఫలముతప్పదు.

(గజేశుని నోముకథ)

ఒకబ్రాహ్మణునిభార్య గజేశునినోము పట్టి ఉల్లంఘనచేసెనుగనుక
శుభామెనోముపట్టుటచేత సిరిసంపదలిచ్చి ఉల్లంఘనచేయుటవల్ల మితి
లేనిశోకము పెట్టెను అందుచేతరోజూకొడుకులకు కూతుండ్రకు వండిపెట్టిన
తరువాత ఆమెయొకచోటకూర్చుండి యేడ్చుచుండెను ఊరివారందరును
కూతలువేయగ విసిగి అడవిలోనికిపోయి అక్కడయేడుపు మొదలపెట్టెను
అట్లుయేడ్చుచుండగా నొకనాడు పార్వతీపరమేశ్వరులు భూమిపాలించుట
కయివచ్చుచు ఆమెనుజూచిఏమమ్మా ఈలాగున యేడ్చుచున్నావనిఅడిగిరి
అందుకామె మీరేమిఆర్చేవారాతీర్చేవారా మీదారినిమీరు వెళ్ళండని
చెప్పగా అలాకాదు ఆర్చేవారము మేమే తీర్చేవారము మేమే చెప్ప
వలసినదనిమరలనడిగిరి మీదయవలన నాకున్ని సిరిసంపదలున్నవి. ఏమి
కారణముచేతనో ఈలాగుఏడవవలెననిబుద్ధిపుట్టుచున్నదని ఆమెచెప్పెను

అప్పుడు పార్వతీపరమేశ్వరులిట్లనిరి. ఓ కాంతా నీవు బారెడు పామును బట్టుకొనిపోయి పట్టెమంచముమీద వేయుము అదినీకొడుకును కఱచును అప్పుడుఅయ్యో? నాకొడుకును పాముకఱచినదనిఏడువమనిరి. ఆమె అలాగే యనిపామునుపట్టుకొని వెళ్ళి పెద్దకొడుకుమంచముమీదపడ వేసెను. పెద కొడుకుయింటికివచ్చి మంచముపైపరుపునుచూడగా అందుబంగారపు గోవ లాముకనబడెను. అత్తమామలనుపిలిచియిదేమనిఅడుగగాఅయ్యో? దానివల్ల యేడ్చుటకునీకుకలిగినదికాదని యారాత్రిమరలయేడ్చుచుకూర్చుండెను. ఆసమయమునతిరిగి పార్వతీపరమేశ్వరులుప్రత్యక్షమై యింకను ఎందుకు యేడ్చుచున్నావనియడిగిరి. మీరుచెప్పినట్లుచేసితిని. ఆపాము నాకొడుకును కఱువలేదు అందుచేత మరియేడ్చుచున్నానని యామెచెప్పగా పార్వతీపరమేశ్వరులు తేలుపట్టుకువెళ్ళి నీకూతురుబొట్టుపెట్టుకొనేకుంకుమ భరిణిలోవేయుము. అదికుట్టును అప్పుడుఏడ్చుదువుగానని చెప్పిరి అప్పుడామె తేలుపట్టుకొనివెళ్ళి కుంకుమభరిణిలోవేయగా మరునాటి యుదయమున నాబిడ్డనుతీసిబొట్టుపెట్టుకొనుటకుఅందులోచేయిబెట్టగాఅందులోనా తేలు చేర్పుకొప్పుబొట్టుయికనబడెను. ఆమెతల్లినిపిలిచి ఇందులోచేర్పుకొప్పుబొట్టు పడవేసినావేమనిఅడిగెను అయ్యో? ఇదికుట్టినదికాదని యారాత్రియెడ విడిపోయిమరలనేడ్చుచున్న యామెకుపార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమై యేమియింకనుయేడ్చెదవనియడిగిరి. అయ్యో? ఆతేలునాకూతురునికుట్టలేదు అందుచేతవచ్చియేడ్చుచున్నానని చెప్పెను అప్పుడుపార్వతీపరమేశ్వరులు,అమ్మా? నీవుపెంచినపిల్లియున్నది. దానినిచంపివడిలోపెట్టుకొనిఏడ్వుమనిరి. ఆమెయింటికివచ్చి పిల్లినిచంపివడిలోనుంచుకొనియేడ్చుచుండగా నూరివారందరునువచ్చి యిదేమమ్మాయనియడిగిరిఅయ్యో! నాపెంపుడు పిల్లిచచ్చిపోయినదని మరింతయేడువగా ఆమెకంటినీళ్ళుపడిబంగారపుపిల్లి అయి వడిలోనుండికిందికిదుముకిపోయెను అప్పుడు పార్వతీపరమేశ్వరులు

వచ్చి [illegible] నీవు [illegible] నోముపట్టి ఉల్లంఘనచేసిరావు. నీవునోము పట్టినందు [illegible] రవదవచ్చినది. ఉల్లంఘనచేయుటచేత విచారమువచ్చి నది. కాబట్టి [illegible] నోముపట్టి ఏడాదియక్షతలువేసుకొని ఉద్యాపనచేసిన యక్షతల నీకియ్యను [illegible] చెప్పిరి. ఆబ్రాహ్మణస్త్రీ ఆప్రకారమునోము నోచుకొని దుఃఖములు [illegible] లోకమున చిరకాలసిరిసంపదలతో సుఖ పడెను.

ఉద్యాపనము— పోలెమగిన్నెను నూని కొత్త మూకటిలో పోసి వత్తి వేసి దీపము పెట్టి స్వయంపాకము, ఒకయణాదబ్బులు దక్షిణతో శివుని యాలయమున పూజచేసుకొని నందిదగ్గర ఆదీపము పెట్టవలయును, కథ లోపమయినను వ్రత లోపము కాకూడదు, భక్తి తప్పినను ఫలము తప్పదు,



# విషయసూచిక.

## (6 భాగములు 64 కథలు.)

### ం 1 నోములుకథలు.



### 2 నం, కథలు.

